శ్రీ

# బృహన్నల నాటకము

లేక

## ( ఉత్తర గోగ్రహణము. )

---

ఇది

బళ్ళారిలోని డిస్ట్రిక్టుకోర్టు వకీలు

"ఆంధ్ర నాటక పితామహ" యను బిరుదావహించిన

## ధర్మవరము - రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్య, వారి సహాయాదరములవలన

ప్రకటింపఁబడినది.

రెండవ కూర్పు

బళ్ళారి వాణీవిలాస ముద్రాలయమున ముద్రింపఁబడియె.

1929.

[ క్రయము రు. 1—0—0. ]

శ్రీ

# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు తత్ప్రవేశస్థలములు.

---

[ పురుషులు. ]

ఇంద్రుఁడు—అం I రం 1, 2.

అగ్ని—వరుణులు ( దిక్పాలవరులు ) అం I రం 1.

చిత్రసేనుఁడు—( గంధర్వుఁడు ) అం I రం 1.

అర్జునుఁడు—( కథానాయకుఁడు ) అం I రం 1, 2, అం II రం 2 అం V రం 2, 3, 4. (శాపమువలన గలిగినపేరు, బృహన్నల అం II రం 3, అం III రం 2, 3, 4. అం IV రం 4, 6. అం V రం 1.

ధర్మరాజు—అం II రం 2, (వేషాంతరమున) కంకభట్టు 3, అం IV రం 4, 5. అం V రం 3, 4.

భీముఁడు— అం II రం 2 ( వేషాంతరమున ) వలలుఁడు 3, అం III రం 4, అం IV రం 4, 5. అం V రం 3, 4.

నకులుఁడు— } అం II రం 2, ( వేషాంతరమున ) దామగ్రంథి
సహదేవుఁడు— } తంత్రిపాలురు అం IV రం 4, 5. అం V 3, 4.

దుర్యోధనుఁడు—అం II రం 1, 4. అం IV రం 1 అం V రం 1.

కర్ణుడు— అం II రం 1, 4. అం IV రం 1 అం V రం 1.

శకుని— అం II రం 1, 4 అం IV రం 1, అం రం 1.

దుశ్శాసనుడు—అం II రం 1.

హలాయుధాసురుడు—(బకాసురుని తమ్ముడు) అం II రం 1, 2, 4.
అం IV రం 1.

విరాటుడు—(మత్స్యపురి రాజు) అం II రం 3, అం V రం 4.

ఉత్తరుడు—(మత్స్యపురియువరాజు) అం IV రం 3, 6.
అం V రం 1, 2, 4.

కీచకుడు—(విరాటుని బావమరిది) అం III రం 2, 3, 4.

కృష్ణుడు— అం IV రం 2.

అభిమన్యుడు— (అర్జునపుత్రుడు) అం IV రం 2, 3, 5 అం
రం 1, 2, 3, 4.

భీష్మ—
ద్రోణ—
కృప—
అశ్వత్థామ—
} అం V రం 1.

సునందుడు— (గంధర్వుడు) అం III రం 1, 3, 4.

## స్త్రీలు.

ఊర్వశి— (అప్సరస) అం I రం 1, 2, అం III రం 1, 3, 4.

ద్రౌపది— అం III రం 4.

ఉత్తర— (విరాటుని పుత్రి) అం IV రం 3, 6, అం V రం 2, 4

విలా— (ఉత్తరసఖి) అం IV రం 3, 7.



**Bellary. D. KRISHNAMA CHARLU,**

**Andhra Nataka Pithamaha,**

Born 1853—Died 1912.

శ్రీ

హయగ్రీవాయనమః

# బృహన్నల నాటకము.

## ప్రస్తావన.

శా॥ శ్రీవిఖ్యాతుఁడు పాండవేయుల మహార్తిం బాపి యెవ్వాఁడు మో |
దావిర్భూతి బృహన్నలాఖ్యులకుఁ? గష్టాజ్ఞాత సంవత్సరం |
బే విభ్రాంతియు లేకయుండఁగగ మాయించెఁ గృపాపూర్ణుఁడా |
దేవుం డీవుత భక్తసంతతులకుం దీర్ఘాయురారోగ్యముల్ ॥

### ప్రథమాఙ్కము-ప్రథమరంగము.

[ ప్రవేశము-ఇంద్రుఁడు-అర్జునుఁడు (ఏకాసనముపైన)
అగ్ని-వరుణుఁడు-చిత్రసేనుఁడు-ఊర్వశి ]

ఊర్వ—(నాట్య గాన అనుబంధము 1.)

ఇంద్ర—ఊర్వశీ! నాట్యము చాలింపుము-విశ్రమింపుము-తనయా! అర్జునా! కాలకేయ నివాతకవచుల వధించిన యాయాసమైనను దీఱదు-మఱునాఁడు పోయెదఁ గాని లెమ్ము.

అర్జు—జనకా! నాకేమియు నాయాసము లేదు, నేనేమి యొనర్చినాఁడను?

ఇంద్ర — నీయిష్టము-నీవాయసురుల వధించిన కాలమందు నీకొసంగిన యీకిరీటము నీకేయిచ్చెదను. ఇది నీవు ధరించుకొన సంగరమున నజేయుఁడవగుదువు-(అని ధరింపజేయును.)

చిత్ర — దేవేంద్రా! నామిత్రుఁడీ కిరీటమున నెంతో వెలుఁగొందుచున్నాఁడు. ఇందుల మణీ సంతానముల సహస్రఫణాసమవధారితాయుతమణీ విరాజచ్ఛేషాహివలె నున్నాఁడు.

ఇంద్ర — చిత్రసేనా! నిక్కమాడితివి.

అగ్ని — పురుహూతా! కవ్వడి కీకిరీటమొసంగుట యితని నీవనవరతము రక్షించుట సూచించుచున్నది. దీనియందలి తేజోమయములగు మణులు భవదాయతసహస్రాక్ష సూచకములై యిందు భవదవతారముఁ బోలెనలరారు.

ఇంద్ర — అగ్నీ! నీవన్నమాట మఱియు మేలు.

వరుణ — దేవనాథా! ఈకిరీటమునందలిమణిదీప్తులు దీనినంతయు నావరించియుండుట కిరీటనామమహామండలి మణిప్రభాప్రతాపలక్ష్మిచే నీమహానీయుఁ డావరింపఁబోవుట సూచించు.

ఇంద్ర — వరుణా! నీయుక్తియింకను లెస్స.

ఊర్వశి — (స్వగతము) మదన సామ్రాజ్య పట్టాభిషేకము గన్న యీయతిలోక సుందరుని భద్రకిరీటమని నే నెంతును.

అర్జున — మహామహులారా! నన్నింతయేల పెద్దచేసెదరు. మీ మహోపకారఫలము శిరసావహించి యిట్లనుభవించి కృతకృత్యుఁడనై మీకు మ్రొక్కలిడుచుఁదనుఁ గదా ధరించెదను.

క॥ మీయుపకారము నీగతిఁ।
బాయక శిరసావహించు భంగిఁ జెలంగన్
ధీయుతులార ధరించెద
నీయుత్తమ మకుటరాజ మింపుదలిర్పన్॥

ఇంద్ర — అర్జునా! ఈశంఖమును నీకొసంగెద-యిది దేవదత్త నామంబునఁ బరఁగుఁగాత (ఇచ్చును.)

అర్జు — మహాభాగ్యము.

చిత్ర — సూర్యునికిఁ జంద్రుఁడు తోడైనట్లాయెను.

క॥ అమరేశ్వరీ ఋషునకు ।

సమరంగ శంఖంబు నిచ్చు టారసిచూడన్ ।

కుముదార్తి కిందు దోడఁగ ।

గమలారి నొసంగు భంగిఁగమనీయముగన్ ॥

ఇంద్ర — ఇంక వేళయైనది వత్సా! అయిన వేపు పోయివత్తువా? నీగృహంబునకు వచ్చి నిను మరలఁజూతును.

క॥ తనయా మూల్లోకములను ।

ఘనుఁడనఁగా నెంతునీవు గల్గఁడనంగా ।

దినకర తేజము మెఱయఁగ ।

వినుమా యనుమానమింక మానుము మదిలోన్ ॥

చిరాయుష్మంతుఁడవై కీర్తివంతుఁడవై మనుము.

(నిష్క్రమింతురు)

శ్రీ

# బృహన్నల నాటకము

## ప్రథమాఙ్కము - ద్వితీయరంగము.

[ అర్జును నిల్లు - ప్రవేశము - అర్జునుఁడు ]

అర్జు — అహో! ఈసురపురిని విడిచిపోవ నాకుమనసేపుట్టదు. చిత్రసేనుఁడు నాకు సంతతసఖుఁడై ప్రియమాచరించుచుండును. మాజనకుఁడు దేవేంద్రుఁడు ప్రేముడి నెంతో చేసెను. ఆప్రేమవలన నే-అయినను-అగ్రజాదులఁదలఁచుకొన్న నిక్కడ కాలు నిలువదు. వారరణ్యవాసక్లిష్టులై యుండుట కానకుందును.

[ ప్ర॥ ఊర్వశి. ]

అర్జు — అమ్మా! విచ్చేయుముఁ (నమస్కరించును.)

ఊర్వ — అయ్యో! అయ్యో! ఇటుతగునా? నేను దేవవేశ్యను, వేశ్యలకు నమస్కరించు వారుందురా?

అర్జు — అమ్మా! నీతల్లి వావియెందుఁబోవును.

ఊర్వ — ఆమాటననుము. నీకభ్యుదయము కాదు.

అర్జు — ఏమమ్మా! వచ్చియుంటివి.

ఊర్వ — ఊరకమ్మా యనకుము నేనొకఘనకార్యము నపేక్షించి నీయొద్ద కేతెంచితిని కూర్చుండుము.

అర్జు — ఎట్టికార్యముకాని చేయఁదగినదేని-చేయఁజాలుదు నేని చేయుదును. (మంచముపైఁగూర్చుండును.)

ఊర్వ — వచనమిచ్చినఁ జెప్పెదను,

అర్జు — అమ్మా! అట్లేలపరిక్షించెదు. నేనప్పుడె చెప్పితిని-నేను చేయఁదగినదైన —

ఊర్వ — చేయఁదగినది - మిగులఁదగినది.

అర్జు — నేను చేయఁజాలుదునే!

ఊర్వ — అందునకు సందేహము లేదు.

అర్జు — అయిన నవశ్యము చేయుదు నానతిమ్మ.

ఊర్వ — రాజకుమారా! యింక చాటుమాటలేల. నేను దేవవేశ్యను. అప్సరసనైనా చే మెప్పుపడినవారి యోగ్యులను. నేనెవరికిని పిల్లవలయు. నీవీ దేవపురికి వచ్చినది మొదలు నీపై నాకు మోహము. నీ చింత నామనసును బాయదయ్యె. ఎన్నిదినములకు ముందో నేఁడవేక్షించు భంగి నీ కూర్మి సుఖము నపేక్షింపవలసియుండెను. నా సురూపప్రభావమును నమ్మి యహంకారమున మోసపడితిని — "నేను కడురూపవతినే. అర్జునుఁ డొక మానవమాత్రుఁడే- అవకాశమిచ్చి ప్రీతి చూపినఁ గైకొనకుండఁడు. నన్ను తానే యర్థింపకుండఁడు" అని నమ్మియుంటిని. సూక్ష్మ భంగి నామనసు నీకెంతయు ప్రకటించినను నీవు దాని గ్రహింపకుంటివి. నేనే వేఁడుకొనినఁ గడుపలుచఁదనమునకు మూలమగు నను శంకచే నీవలను మాఱగాకుంటిని. ఇంక నెన్నినాళ్లో కలుగదా, యనిజ్యావాసకాలమంతయు నిందె యుండఁగలవు కదా యాతురమేలయని దావాగ్నివోలె నామనసుఁ గరఁగించుచుండు నీపై బాళినంతయుఁ గ్రొత్తరూపంబున నట్లె మ్రింగుచువచ్చితిని. రేపు మీవారలయెడకు నీవుపోయెదవని విన్నంతనె తెలిసికొని. వెన్నెనగోలుపోవుచున్న జీవవలె సొలసితిని. మాగ నిశాతసాయకంబుల నెంతయు నలసితిని. నినుఁ గలసితిననుటకును లేక పొలసితిననుటకున్న నీచేత నున్నది నన్నోటువడఁజేసితివి. నీ మోహవాగురన్నను వేసితివి. కడకియెడకు నన్నురాఁదీసితివి. మనోరమణా! వేమాటలేల? నీయనంగ సౌఖ్యము నభిలషించిన నన్నాదరించి, దయారసముగురిపించి, యింపుసొంపు వెలయించి, నను జయించిన భంగి నీ క్రూరమారుని నోడించి రక్షింపవలయునని విన్నవించుదానను. మోహము వెంచుదానను. అత్యర్థము ప్రార్థించుదానను.

( అనుబంధము 2 )

అర్జు — అమ్మా! ఎంతమాటాడితివి! ఉట్టిపాటున ఉట్టిపట్టిదంపు గట్టిపలుకులు పలికితివి! నిన్నింతదూరము మాటలాడనిచ్చినది నా తెచ్చిపాటుగాని యిచ్చపాటు గాదు. ఇట్లు నీవు వాకొనఁదగునా? ఇట్టి దుర్మోహము మేకొనదగునా? ఇట్టి దుర్మతము నూఁకొనఁదగునా? ఇట్టి దుష్కార్యము మైకొనఁదగునా? ఇట్టిమాటలాడుటకా నీవింతదూరము వచ్చినది.

( అనుబంధము 3 )

ఊర్వ — ప్రాణవల్లభా! తొలుత నెట్టి కార్యమునైనఁ జేసెదనని వచనమిచ్చి యింతలోఁ దిరుగుట సత్యవ్రతుఁడును-ధర్మవిందుఁడును నగు నీకర్హమగునా?

అర్జు—నేను ధర్మవిధుఁడను కనుక నే యీకార్యము దుష్టమనియు ననంగీకృతమనియుఁ బలికెద. సత్యవ్రతుండగు గనుక నేఁ జేయఁదగనిదియుఁ జేయఁజాలనదియుఁగాని యీదుష్కార్యము తగదని నుడివెద.

ఊర్వ—మనోహర? ఈకార్యమేల చేయఁదగనిది.

అర్జు—నీవు తల్లివి కావా?

ఊర్వ—నేనెట్లు తల్లిని?

అర్జు—జనకుఁడగు నింద్రునిఁ జేపట్టవా?

ఊర్వ—అయ్యో! ఇట్టివైదిక భ్రాంతి నీకుఁ గలుగునా? వేశ్యలకు మాకెక్కడి వావి?

ఆ॥వె॥ వావి యెఱుఁగరాని వనజాక్షులకు దేవ।
వేశ్యలకుఁ గణించి పృథివి లేని।
వావి వరుసలెంచు వైదికభ్రాంతి నీ।
కేలగలిగె నెంత గోలవైతి॥

నేనొక్కటియడుగుదును. యజ్ఞము చేయువారికిని యుద్ధమరణము నొందినవారికిని, రంభాదులగు మాతోడ సంభోగము లభించునని నీ వెఱుఁగవా?

అర్జు—ఎఱుఁగుదును—అయిన?

ఊర్వ—నీవు యజ్ఞము చేసిన నాభోగము నీకుఁ గలుగదో?

అర్జు—అదేల? నీవొకతెవో యుండునది.

ఊర్వ—రాజకుమారా! ఎంతసులభముగఁ గట్టువేసితివి! నేనొకతెయే కాదుండునది. రంభాదులెందఱో యున్నారు. వారినిగూర్చి నుడువుఁగా? వారు మాత్ర మింద్రభోగము వదలనివారా? వారును తల్లివావి కలవారు కారా? యట్లైన—

అర్జు—అదియుండనిమ్ము. ఈదేహమున నాకింద్రుఁడు తండ్రి. చచ్చినపిదప నీదేహముండదుగదా? శరీరాంతరమున నేమొనర్చినను దూషణీయము కాదు.

ఊర్వ—అనభిమతకార్యము నుపేక్షించుటకుఁ గారణము లెన్నియో, కల్పింపఁగూడుట నే నెఱుఁగనిదాన, గాను. అకటా! జన్మజన్మాంతర తపఃఫలంబుననైనను లభింపని యప్సరస్త్రీ తానై సకలేతర సౌఖ్య మివ్వఁదలపడి వేడుచున్నను, వలదనుగోల వేల మున్నెందైన వినఁబడెనా?

మ॥ అకటా ధర్మము లెన్నియో పలికి దివ్యాహార్షిఁ గన్నట్టి నా।
రికినైనం బరికింపరాని సురనారీరత్న మాసక్తఁ గని।

వక తానే సశరీరభోగము ఘటింపన్ గోరి రాఁద్రోయలే।
వాకో భామామణి సైఁబసంగడ గనుద్యోగంబు సద్యోగమే।

కటాక్ష ప్రసారణమాత్రమున ముజ్జగంబులఁగల తరుణవయఃపురుషసంతానమును గెలువఁజాలు నాదుహిమ నేఁడిట్లు వట్లుపోవునే? పాండుకుమారా! పురూరవశ్చక్రవర్తిని నీవెఱుఁగవో? జితేంద్రియత్వమున నాకుఁ దలయొగ్గని చిట్టినుట్లాడుచుండెను. వానికిఁగల గర్వాంధకారము నామందస్మితచంద్రిక యొట్లుమాయించెను.

అర్జు—మఱియు మేలయ్యె. ఆ పురూరవసుఁడెవ్వఁడింత యొఱుఁగుదువా? అతఁడు మా కులప్రశాతలతాత. నీయునియుని మునుముని నీవు కాంక్షించితువో? నాకూరక వంత యిడకుము.

ఊర్వ—సమక్షమున వంతయేలవలయు?

( అనుబంధము 4 )

అర్జు—అమ్మా యిఁకఁజాలించుము, పొమ్ము నాకు నిదుర వచ్చుచున్నది

ఊర్వ—అయ్యో! నాకు రాకున్నదే! నీనిదురను సగమునిచ్చి నను నీయర్ధాంగినిఁగాఁ జేయరాదా?

అర్జు—ఇదియేటి చమత్కారము.

ఊర్వ—నాచమత్కారము కాదే నన్నీస్థితికిఁ దెచ్చినది. నన్నొకదాని నొల్లవో లేక కామసన్న్యాసము నీకుఁ గలిగియున్నదో నీవె మేకపత్నీవ్రతుఁడవా? ద్రౌపదిమాట యటుండనిమ్ము. సుభద్రకై కైతవసన్న్యాసివి కావో? నాయెడనా నీవు నిక్కపు సన్న్యాసియైనది. ఉలూచిని జూచినమాత్రమునఁ గౌఁగిలింపవో? చిత్రాంగదకుఁ జిత్తాంగదాన మొనర్పవో. నీసౌందర్యామృతపానమున నె మత్తతఁ జెందియుండిన నాకు నీవు వెలిబోయెదవన్నఁ బ్రమత్తతఁగలిగె. సమ్మతిగాకున్న నసమ్మతినైన నీ విలాసంబుధి నోలలాడుదుఁగాక.

(మంచముపై కూర్చుండును.)

అర్జు—(దిగి) ఊర్వశీదేవి! "సాహసంపద్గుణంచైవ" అనుమాట నీకతమున నేఁడు నెగడెను. నీకిది బుద్ధి కాదావల యూరకపొమ్ము.

ఊర్వ—(దిగి) మనోహరా! నీకఠినభాషణమారుతమున నాయెద నున్నమదనాగ్నిని మరింత ప్రజ్వరిల్లఁజేసెదు, ఏలకోపించెదవు రమ్ము. (చేయిపట్టఁబోవును (

అర్జు—(దూరముపోయి.)

ఉ॥ ఈకలుషోక్తులాడ నను నెవ్వనిఁగాఁగ దలంచితమ్మ నిం
దాకరకృత్యముల్ నిరయంబునకుం బథమమ్మ మాని సు
శ్లోకవుగాఁగదమ్మ జనలోకవిగర్హితతుచ్ఛవృత్తిము
న్నైనకొనఁబోలదమ్మ బహుమానము నీకగనమ్మ కోమలీ!

ఇట్టి హీనతకారితనము నీయందుండునని యొకనాఁడు తలంపను. ఎంత దేశవేశ్యవైనను ఇట్టి దగ్ధనీతిఁ దగునే? నీదశ్చరిత్రము నంతయు మాయయ్యతో విన్నవింతును.

ఊర్వ—ఔరా! ఎంతభయపెట్టెదవు? మీయయ్య నాకొక పరిలోఁ బడునొకండెవ వాఁడేకదా? మీయయ్య నొప్పించి నినుఁగూడుదు సమ్మతింతువా?

అర్జు—ఇట్టి సాహసిని నెవరాపుదురు? నీకు నమస్కరింతు నావలఁబొమ్ము.

ఊర్వ—ఇట్టినమస్కృతి నాకువలదు.—నాకు నీవు నైపై సాష్టాంగ నమస్కార మొనర్చినఁగదా నాయుడదని. దానికై యెల్లన భరింతును.

అర్జు—నీవల్లభుఁ డగువానితో నిట్టిసరసములాడఁ బొమ్ము.

ఊర్వ—నీకంటె నాకెవఁడుగలఁడు. మాటలాడఁ గొలఁది కొలఁది మీ యతిమోహాతిశయము నన్నేమేమో చేయఁ బ్రేరేపించుఁగదా?

అర్జు—అట్లయిన నీదారిని బొమ్ము.

ఊర్వ—నాదారిని బోవనిచ్చిన నింత సంవాదమేల. ఇదియే నాదారి. (ఆలింగనము చేయబోవును.)

అర్జు—(త్రోసి) దుర్మతము.

ఊర్వ—మదనరూపవైభవా! ఉదారమహాగుణ భూషణుఁడవగు నీకిట్టికి రామదియేల గలిగె? నీవు త్రోసినందున నావీపున దెబ్బదగిలి నాకు చనీమనొప్పగొని యున్నది గదా నీకోమలకరకరణమున నీకితనపు గాసి తీర్పరావా.

అర్జు—హరి హరి! (చెవులు మూసికొనును)

( అనుబంధము 5 )

ఊర్వ—అయ్యో! ఇట్టి నపుంసకుఁడవగుదువని యెఱుఁగుదునా! నిను మోహించుట రాబొమ్మను మోహించుట యాయెనే. అంతకంటె నికృష్టము. రాబొమ్మయైనను నాకాలింగనము నిచ్చును. ఇది శూలకంటకదృష్టప్రీతిము. నన్నింతపరిభవింతువే. ఇంత నొప్పింతువే, స్త్రీజన్మము నింద్యముగాఁగాక. అయ్యో! దయలేదే.

( అనుబంధము 6 )

(అంటఁబోవును.)

అర్జు — దేవీ! నీవు నాయానన గలవు. నాయింటికే తెంచి యిటు నన్నాడి చేయుదువే. నీవు పెద్ద పెనఁగిన నీవబలవగుదువు గాక నిన్ను నాయిల్లు వెడలింతును.

ఊర్వ — పెద్ద పెనఁగిన నిల్లు వెడలింతువా? నీవింతకు పెనఁగిన నే నిప్పుడే వెడలిపోయెద. ఇఁక నీవు మారాడిన నా పోరామి యంతయుఁ దీఱ నీవు రారామియగు ఘోరశాప మొసఁగుదు.

అర్జు — (నవ్వి) ఔరా! నను బెదరింపఁజూచెదవో?

మ॥ ఖలిరే ననున్ శపియింతునంచు బెదరింపం జూచెదే శాపముల్।
బలిపోయునె నన్నుఁ గాని కార్యమున కుత్సాహంబు పుట్టింపఁగాఁ।
గలవంచున్ మదిఁ దప్పి చిరవి నీకార్పణ్యమిం దొక్కటే।
నిలుచున్ శాపములెన్ని యైన ధరణిం ధీరున్ దలంకించునే॥

సత్యసోక్తులఁ గాని పరి శాపోక్తుల నగునె. వలసిన శాప మొసఁగుము. ఈ పాపకూపమునఁ బడకుండ బోధింపఁజాలు —

ఊర్వ — ఔరా! నిక్కువమా! భరింతువా! కటాక్షవీక్షణమాత్రమున వేనవేల భంగులఁ బొంగింపఁజాలు రమణీమణి తానే యభ్యర్థింప సిరికిమోఁకాలొడ్డిన భంగి వలదని బేలు పుచ్చి డీలుపడఁజేసి లేని గానల ద్రవ్వి పలవని నాపులఁ గల్పించి తుదకుఁ శాపహతి గ్రుంగి కంటికిం జెడిన రేవణభంగి విలపించు విధి నీకుఁ గలిగియుండ నీ వేమి చేయుదువు? కామము క్రిందుపడినఁ గ్రోధము తత్స్థానము నధిష్ఠించు భంగి నీ వెఱుఁగవో! నామాట నొనరింపవా? ఒనరింపవా? నా క్రోధాగ్నిం నీదయాసారమున నార్పవా?

అర్జు — తల్లీ! నీ కామమునకు నా నమస్కారము - నీ క్రోధమునకు నా తిరస్కారము. నీ క్రోధాగ్ని నార్ప నా దయాసార మేల కావలయు? నీ పశ్చాత్తాప పూరమే చాలదా. నీ ప్రతాపమిఁకఁ జాలును. ఇవి పాపాలాపములు - నేనింక నీతో మాఱుమాట పల్కను.

ఊర్వ — అక్కటా! నాకు మాఱుపల్కకుండినఁ గోపమేల వచ్చును. జిగిబిగిగలమగు పలుదెగడు మగతనము పాటించు మగపంద నెందైనఁ గంటిమే? సముంచితరూపా వయోవిలాసమై, దేవనగరీనివాసమై, శాపానుగ్రహణ విచక్షణమనోవికాసమైన నీ యప్సరోగంధఫలీనాసతిరస్కృతయై యూరకపోవుదునా? నీ యెట్టి పుంస్త్వ హీనుఁడుండిననేమి యుండకున్న నేమి? నపుంసకక్రియా విచారమునను నీకు సముంచితాభిలాషమున్నట్టున్నది. ఏలకాదనవలె? నాకుంగాని నీపురుషభావము వేఱొక్క నాసపతి యనుభవించునే నీవు నపుంసకుఁడ వయ్యెదుఁ గాక.

కం॥ నిండారుమోహమున నను ।
కాంతుఁడు మనసీఁడు కరుణఁ గైకొనుమనుదే ।
వాంఛజగామిని నొల్లవె ।
షండుఁడవై మనుము పురుషసత్త్వవిహీనా ॥

ఇంక సంతసించితిని. సుఖమున నుండుపొమ్ము. (నిష్క్ర.)

( అనుబంధము 7 )

అర్జు — హా! సుఖము-దుఃఖము-ఏ నేమి చేయుదును. నాపరిభవమున కేమందును ?

శా॥ నానాభంగుల బాధకోర్చితిని మానధ్వంసమే కోర్చితిన్ !
దీనత్వంబు ఘటిల్లు టోర్చితి విరోధి ప్రాభవం బోర్చితిన్ ।
ఏ నెట్లోర్చెద నీమహాకలుష కృష్ణఘ్నాతపాతంబయో ।
ప్రాణంబైనను బోవకుండ నను నిట్బాఁగిన్ విదారించునే ॥

ఈయము యింతటి రాగయవునే-అకటా ! ఇంతటి ఘోరశాపముపాలు చేయునే. అయ్యయో ! నపుంసకభావము నేనెట్లోర్వఁగలను. ఎంతటి ధీరుడైననేమి? ఎంతటి బాహుసత్త్వండైన నేమి ? ఖాండవము దహించిన నేమి ? ఇంద్రునితోఁ బోరిన నేమి ? శివుని మెప్పించిననేమి? చింతామణీ భద్రాసనార్థమునను నేమి? కాలకేయుని వాత కవచాదులఁ జంపిననేమి ? దివ్యకిరీటము, దివ్యశంఖము, ధవ్యాస్త్రసమితియు, చండగాండీవమును, ఇవియెన్నియుండిననేమి ? అర్జునుఁడు నపుంసకుఁడందురుగదా? విజయుఁడనుఁగాక-బీభత్సుఁడనగుదు గాక-సవ్యసాచినగుదుగాక, యేమయిననేమి? నపుంసకుఁడనగుదుఁగా? కారణము లేని కారణ బదియు రెండేఁడు లరణ్యవాసమునకుఁ బంపిరిగా? ఇంత దుఃఖింపనైతి. పరియును రెండు నెలలింక జ్ఞాతవిధిని నిర్వహింపవలయుఁగా-ఇంతైన యోచింపను-అకటా ! ఈజగత్కర్తృ క్లీబభావమునకు నేనెట్లోర్చుకొందును? హా! శ్రీహరీ. (మూర్ఛిల్లును)

[ ప॥ ఇంద్రుఁడు. ]

ఇంద్ర — అర్జునా! ఏల యీవిచారము. ఊర్వశివలన నీయుదంతమునంతయు వింటిని. నీమేలుకొఱకే యీశాపము గలిగినది. భానుకోటితేజోంచితుఁడవగు నీవెట్టిమాఱు వేషము వేసుకొన్నను గుఱుతింపబడుచుండుటరిది. కావున నీకజ్ఞాతవిధికి మిక్కిలి యనుకూలము - ఆవత్సరముననే నీకీశాపముండఁగలదని సవరించుచున్నాను- యోచింపకుము.

(అనుబంధము 8.)

మ॥ తనయా భానుని తేజ మింపెసఁగ సాంద్రఖ్యాతిరంజిల్ల నీ
వనయంబున్వెలుఁ గొందఁగష్టతర మాయుర్జ్ఞాతవాసంబునన్ ।
జను లెవ్వారును గానకుండు టదిమున్ సాధ్యంబె యావత్సరం
బున నీశాపఫలంబు గల్గునటు లామోదంబునన్ దీర్చెదన్ ॥

అర్జు—జనకా! నీయాదరణమగణ్యము. ఇది నాపుణ్యము.

శ॥ "నీయాదరణమగణ్యము ।
వాయదు నాయందుఁ బుత్రవత్సలత కృపా ।
తోయధివై రక్షించితి ।
పోయెద సెలవిమ్ము విబుధపుంగవ జనకా" ॥

ఇంద్ర—నీ వేమియు స్తుతి సేయవలదు. తొలిజామునకు నీప్రయాణమునకు విమానమాయిత్తమై యుండఁగలదు. నేను వచ్చెదను.

(నిష్క్రమింతురు.)

—: ప్రథమాంకము సమాప్తము :—

శ్రీ

# బృహన్నల నాటకము

## ద్వితీయాఙ్కము.

### ప్రథమరంగము-హస్తినాపురి.

[ ప్ర॥ దుర్యోధన-దుశ్శాసన-కర్ణ-శకునులు. ]

దుర్యో — దుశ్శాసన! నేను చెప్పినగూఢచారులను బంపియున్నావా ?

దుశ్శా — అగ్రజా! అప్పుడే పంపియున్నాను, వారు సుభటులు-ధీరవిహారులు.

దుర్యో — మాతులా! ఇంత ప్రయత్నము చేసినను మనచారులు పాండుపుత్రులను గుఱుతింపకున్న నెట్లు ?

దుశ్శా — అన్నా! మనచారులు యుక్తిపరులు. పాండవులు సముద్రమున దాఁగియున్నను వెదకి తేఁగలవారు.

శకుని — సుయోధనా! నీవు చింతింపకుము. భీముఁడు బకాసురునిఁ జంపినయాప్త్యచేయఁదగు సహాయుఁడై వచ్చియున్న యితనితమ్ముఁడు హాలాయుధాసురుఁడు డుండలేదా? వానితో నిప్పుడే మాటలాడి యున్నాను. మనచారులవలనఁ గానిపని వానిబలమున వాఁడు సాధింపఁగలఁడు. అప్పుడింకను బదమూఁడు సంవత్సరములే ఏకచ్ఛత్రాధిపత్యము గలుగఁగలదు.

( అనుబంధము 9 )

ఆహాలాయుధుఁడు వచ్చుటకును వేళయైనది.

దుర్యో — మాతులా! నిన్నుమించినయుక్తిశాలియు ధీశాలియు నెవఁడుగలఁడు. నేను ధన్యుఁడనైతిని నిన్ను నుతింపఁజాలను.

ఉ॥ ధీరవిచార నీదగు సుధీసముదగ్రత బాపిమెందున ।
నార్సి దేవనాథుని బృహస్పతి వైఖరిఁగౌరవాళికిన్ ।

వేరుగ బెంపు నిచ్చితివి పెట్టనికోటవు ధీవిచారతన్ ।
కారుణికాగ్రగణ్య రిపుకాలుఁడ వీవు తలంప మాతులా॥

శకు—రాజేంద్రా! నీవా పాండవులకై చింతింప నేల. ఈయజ్ఞాతవత్సరము కడచనకమునుపే వారసువులఁ బాయుదురా? నీతేజోలక్ష్మియే వారి సత్త్వహీనులఁ జేసియున్నది.

ఉ॥ అర్థవిహీనులై రిపుజయప్రదశీలవిదూరులైనయా ।
పార్థులకై ధరారమణ బల్మఱుఁ జింతిలనేల నీవిథా ।
సార్థకశౌర్యసంతతి కయారె యలంకరి నాఁడునాఁటికిన్ ।
వ్యర్థులుగారె నీయెదుట నాహవభూమిని నిర్వ్యపేక్షరే॥

[ ప్ర॥ హాలాయుధుఁడు. ]

హాలా—సుయోధనరాజేంద్రా! నమస్కారములు.

దుర్యో—హాలాయుధా! మామామ నీతోడనన్నియుఁ జెప్పియున్నాఁడఁట నే? నీవెట్లైనను మాయాబలమునఁ బాండవుల గుఱితించి వచ్చితివా నీపగయు మాయొండటి పగయుఁదీఱును.

హాలా—రాజేంద్రా! ఈక్షణమున నీకార్యము నిర్వహింతును.

శకు—హాలాయుధా! నేనింకను సంగతులన్నియు సవిస్తారముగాఁ జెప్పెద నిట్లురమ్ము.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# బృహన్నల నాటకము.

## ద్వితీయాఙ్కము.

### ద్వితీయరంగము-దుర్గాలయము.

[ ప్ర। ధర్మ-భీమ-అర్జున-నకుల-సహదేవులు. ]

( దూరమున-హాలాయుధుఁడు )

---

ధర్మ—అనుజులారా! కర్తవ్యములన్నియు నిర్ధారితములాయెఁగా. మఱియొక సంకేతము-కంకివలల బృహన్నలదామగ్రంథి తంత్రీపాలమాలినులని మనకుఁ బేరులుగదా! అయిన మనలో మనకుఁ గ్రమముగా జయ జయంత విజయ జయత్సేన జయద్బలాఖ్యానంబులుండవలయు. ఇక్కడికి నేనవనాఁడు మనము విరాటనగరిఁ జేరఁ బోవలయు. దినము నొకరుగా విరాటుని సందర్శింపవలయు. ఈభవాని హైమవతి మమ్ముఁ గొసఁగులవలన దప్పించి రక్షించుటకీ దేవిని నుతింతము. ఇంతలో ద్రౌపదియు సిద్ధముగానుండఁగలదు.

( అనుబంధము 10. )

(నిష్క్రమింతురు.)

హాలా—(స్థానమునకువచ్చి) భళిరే-ఈ ధర్మజుఁడు కంకసన్యాసి కాఁబోవునో? భీముఁడు పలలుఁ డగునో, అర్జునుఁడు ఆడియుఁగాక యిడియుఁగాక పోవునో, నకులుఁడు గాడిదెలఁగాచునో? సహదేవుఁడు గోమయపిండములు చేయునో? ద్రౌపదిబహిరంధ్రయగునో! భలా భలా? ఇపుడుఁగదా నాపంతము గెలిచె. ఇపుడుఁగదా నాపగ దీఱె. ఇప్పుడేపోయి సుయోధనరాజున కంతయు నెఱిఁగింతును.

దేవి—మూర్ఖదైత్యాధమా! నన్నునమ్మిన యీపాండవతనూజుల భంగపాటునకు నీవు కారణమయ్యెదవా? నీకుఁ దగినశాస్తి యిదె. (పాశమునఁగొట్టును.)

హాలా—(మూర్ఛిల్లును.)

(యవనిక దిగజారును.)

శ్రీ

# బృహన్నల నాటకము.

## ద్వితీయాఙ్కము.

### తృతీయరంగము మత్స్యపురి.

( ప్ర॥ విరాట-కంక-వలల-సేవక. )

విరాట — కంకభట్టా! వలలా! అయిన నాపాండవులెందుఁబోయినదియుఁ దెలియదో?

కంక — రాజేంద్రా! మాకుఁ జెప్పవురా! ఏమి చెప్పవలెను అటుమొన్నఁగదా వారియజ్ఞాతవాసప్రారంభము-ఉదయమునఁ దొలిజామున లేచితిమి-మేము మాత్రము నిలిచితిమి.

సేవక — రాజేంద్రా! ఒక పేడివచ్చి కాచియున్నాఁడు.

విరా — రానిమ్ము-ఆహా! రూపము మాత్రము పేడియగుఁగాక మహోన్నతతేజముఁజూడ నింద్రుని నవ్వులాడుచున్నాఁడు.

( ప్ర॥ బృహన్నల. )

( అనుబంధము 11. )

బృహ — విరాటమహీపాలకా! అభివాదముఁజేతు బృహన్నలయను పేడిని. పుట్టినది మొదలు ధర్మరాజును సేవించుచుంటిని. అతఁడు నను దనతోడఁబుట్టువులలోనివానిఁగా నన్నాదరించుచుండె. అనవరతము నన్నుఁ బాయఁడు. కుంతీకుమారులు నన్నొకయొక్కఁడవానిఁగా భావించుచుండెను అతని దేవియొద్దను నన్ను సంశయింపకుండును. వలసినభంగిఁ దిరుగాడుచుంటిని. ఆమహారాజున కజ్ఞాతవిధి ప్రాప్తించినందున నాకు నష్టవిధి కలిగియున్నది. ఆరాజు సమయము నెఱపివచ్చిన వెంటనే యతనితోఁ జేరికొనుచున్నాను. ఈ కష్టసంవత్సరంబున నాకింత యోలమిచ్చి రక్షింపఁ బ్రార్థించెద.

శా॥ ఓ రాజన్యకులావతంస విమలోగ్రోద్యగుండు ధర్మాత్మజుం
డా రాజన్యవరుల్ ఘటించెవిధి నేఁ డజ్ఞాతదుఃఖంబుమా
ప్రారబ్ధంబుగదా విచారవిధిప్రాప్తంబయ్యె నారాజు స
త్యారూఢిం గడఁజేరువాఁక నను గోత్రాధీశ పాలింపవే॥

వేషమునకుఁ దగినకొలఁది సంగీతనాట్యాభినయముల యందును బరిచయము వడసినవాఁడ.

విరా—కంకభట్టా! నీవీ పేడి నెఱుఁగుదువా?

కంక—ఈపేడి చెప్పినదంతయు సత్యము. మాకంటె నీపేడియె యెక్కుడుగా నుండెను. రాజవిద్యాపరిచయమున నితనికంటె నెక్కుడగు వాఁడుండుటరిది. దానివలన నింద్రునైనను, శివునైనను, మెప్పింపఁగలవాఁడు, ఎందరింగాని యవలీలజయించును.

విరా—అంతశాస్త్రపరిచయము కలవాఁడా! బృహన్నలా! నీవుమాపురముననే వసియించుచు, మా కుమారికలకు విద్యాభ్యాసము చేయింపుము. సేవకా! ధర్మరాజునొద్ద వారెవ్వరు వచ్చినను మాపీటనుండ నియమించినానని చాటింపుము.

కంక—అతని యశ్వగోశిక్షకులు పూజనీయులు. వారును రాఁగలరు.

వలల—వారును మావలనే-తమ్ము లేకానోపుదురు.

విరా—అశ్వగోపాలురకు సయితము చనవిచ్చునా?

బృహ—రాజేంద్రా! అతని నెంతవి కొనియాడవలయు.

( అనుబంధము 12 )

సేవక—రాజేంద్రా! ధర్మరాజు దేవియొద్దనుండిన మాలినియను పేరుగల పరిచారిణి నొర్తుమన యంతఃపురమున దేవిగారిచే నెలకొల్పఁబడినదనియు, దేవిగారు మీతోడ మాటలాడఁ గోరుచున్నారనియు నంతఃపురసేవకుఁడు విన్నవించుచున్నాఁడు.

విరా—ఇప్పుడే వచ్చెదను. కంకాచార్య! వెళ్ళయదవి.

(నిష్క్రమింతురు.)

శ్రీ

# బృహన్నల నాటకము

## ద్వితీయాఙ్కము.

### తృతీయరంగము - కౌరవసభ.

[ ప్ర॥ దుర్యోధన - కర్ణ - శకుని - దుశ్శాసనులు ]

చారుఁడు — దేవా! మాయాలస్యమును క్షమింపవలయు. ఆహారనిద్ర లెఱుఁగక పాండవులు పోయిన పోకలన్నియు నరసితిమి. ఊరూరా వెదకితిమి. అరణ్యముల నన్వేషించితిమి బ్రాహ్మణరూపముల వాఁరసాంఘిలమోసపుచ్చి యంతంతో చేసితిమి. ఎందును వారిపొలకువ కానరాలేదు. మరలివచ్చుచో మార్గమున నొకదుర్గాలయమున నికటమున దేవమిత్రుఁడగు హాలాయుధాఖ్యుఁడు పిచ్చిపట్టినట్లు మూకత్వమునను౦డ నతనిఁ దోడ్తెచ్చియున్నాము.

దుర్యో — ఏఁడీ.

[ ప్ర॥ హాలాయుధుఁడు. ]

హాలాయుధా! పాండవులచందము నీవేమైనఁ దెలిసితివా?

హాలా — (ఔనని సైగ చేయును.)

కర్ణ — ఇదియేల యిట్లు తలయూఁచెదవు? ఎందుకు మాటలాడవు.

హాలా — (మాటలరావని సైగ.)

కర్ణ — ఏమి గ్రహచారము? నిన్నెవ్వ రిట్లుచేసినది,

హాలా — (దేవుఁడను సైగ చేయును.)

దుర్యో — దేవుడా? ఏదేవుఁడు నిన్నిట్లుచేసెను.

హాలా — (స్తనములు చూపించును)

శకుని — ఓహో తెలిసెను. దుర్గాలయముదాఁపున నీవుఁడున్నట్లుగదా తెలిసెను.

ఆదేవియే యిట్లుచేసినది. ఈబాధ్యయులేని మూకత్వము కడువింత! హాలాయుధా! దుర్గాదేవియే యిట్లు చేసెనా?

హాలా—(అవునని సైగ)

శకుని—ఏ వేల సెను?

హాలా—(పాండవులుండినట్లు, తాను చూచినట్లు వారు వెడలిపోయినట్లును దేవితన్ని నట్లు, మేలుకొనినవెంటనే మూకత్వము కలిగినట్లు, సైగ)

శకుని—దైవముతో డొక్కటియైనను తెలియదు ఏమిటిదియో?

హాలా—(ముఖముకొట్టుకొనును)

శకుని—నీవు పాండవులఁజూచితివా?

హాలా—(చూచితిని—సైగ)

శకుని—వారు దుర్గాలయమున నుండిరా?

హాలా—(ఉండిరి-సైగ)

శకుని—అజ్ఞాతవిధికి వెడలిరా?

హాలా—(వెడలిరి-సైగ)

శకుని—వారు మాటలాడుకొన్న దేమయినను వింటివా?

హాలా—(వింటిని-సైగ)

శకుని—వారెక్కడికిఁబోయిరి?

హాలా—(దూరము-సైగ)

శకుని—ఇంద్రలోకమునకా?

హాలా—(కాదు-సైగ)

శకుని—గుహలలో డాఁగియుండుమని మాటలాడిరా?

హాలా—(లేదు-సైగ)

శకుని—రూపాంతరముల నేమయినను గ్రహించిరా?

హాలా—(ఔనని-సైగ)

శకుని—ఏమిరూపములఁగైకొందుమనిరి?

హాలా—(సన్యాసి-వంటలవాఁడు-పేఁడి-గోపాలకుఁడు-గుఱ్ఱపువాఁడు-అని సైగ)

శకుని—(నవ్వి) గ్రహచారము-గ్రహచారము కర్ణా! దుర్యోధనా! మీకేమైనఁ దెలిసెనా?

కర్ణ—ఒక్క మాట

దుర్యో—దైవముతోడు.

దుశ్శా—నీయానగలదు.

శకుని—ఒక్కరొక్కరి నడిగెదను. ధర్మజుఁడే వేషముధరించె?

హాలా—(క్షౌరము-సైగ)

శకుని—మంగలివాఁడగునా?

హాలా—(కోపమునఁ జేయివిసురును)

శకుని—మఱేమనవలయు? విధవవేషము ధరించెనా?

హాలా—(వెనుకదిరుగును)

శకుని—కోపగించకుము-భీముఁడేమాయెఁ జెప్పుము?

హాలా—(ప్రోయిని, కట్టెపెట్టియూదిన-సైగ)

శకుని—కొమ్ముదమాలవాఁడా?

హాలా—(కాదనిసైగచేసి, గంటె త్రిప్పినసైగ చేయును)

శకుని—బెస్తవాఁడాయెనా?

హాలా—(తలత్రిప్పి, తపెలయునన్నముడికిన భంగియుఁజూపును.)

శకుని—మూగగుండ్లాటవాఁడా?

హాలా—(వెనుక దిరుగును.)

శకుని—కోపమేలపోనీ? అర్జునుఁడేమగును?

హాలా—(చీరయు-స్తనములు చూపును.)

శకుని—(స్వ) ద్రౌపది సంగతియేమో చెప్పుచున్నాఁడు (ప్ర॥) ద్రౌపది కాదర్జునుఁడు.

హాలా—(ముఖముకొట్టుకొని మీసములు గొఱుగు-సైగ)

శకుని—(ఆత్మ) మంగలివాఁడగునేమో (అనియడపము సైగచూపును.)

హాలా—(ఔనని-సైగ)

శకుని—అబ్బా! ఇక్కడికొక్కటి తెలిసెను. అర్జునుఁడు మంగలియైనాఁడు-మంగలియై యెక్కడనున్నాఁడు.

హాలా—(వెనుకఁదిరుగును.)

శకుని—కాదా? ఇదేటి గ్రహచారము? పోనీ నకులుఁడేమయినాఁడు,

హాలా—(కొరడాచూపికొట్టును.)

శకుని—చదువులయ్యవారా?

హాలా—(తలత్రిప్పిగఱ్ఱము సైగచూపికొట్టును.)

శకుని—అశ్వము నెక్కి యుద్ధమాడఁబోయినాఁడా?

హాలా—(వెనుకఁదిరుగును.)

దుర్యో—మామా! ఇదియిట్లు సరిపడదు. ఏమైన నుపాయమున నాశయము వెలింప వలయు.

శకుని—నాశనమాయె! ఇంక నుపాయమేమి? (యోచించి) హాలాయుధా!

హలా—(తిరుగఁడు)

శకుని—కోపమువలదిదియొకమాట చెప్పుము. కాకితము లేఖినియు నిచ్చిన వ్రాయుదువా?

హాలా—(తిరిగి యాతురమునఁ దెమ్మనును.)

( కాగితము లేఖినియు నిత్తురు. )

హాలా—(వ్రాయును) "నీయాజ్ఞ గైకొని మా తమ్ములపయిన ధర్మరాజు నామముల వెలిబుచ్చి యొకటిని వానికొక్కొక వేషము ధరియించిరని" (వర్ణించును)

శకుని—అయ్యో! (తీసుకొని) ముందైనను వ్రాయుము.

హాలా—"విప్రుడై బోయె ధర్మరాజు భ"—గాను

శకుని—ముక్కలి వణంకుచోట్లు విడిచి మిగిలినపంక్తియు వ్రాయుము.

హాలా—"భీముడు వ—గాను, అర్జునుడు న—గాను. నకులుడు తు—గాను, సహదేవుడు గ—గాను, ద్రౌపది స—గాను, ఉండునట్లు నిర్దేశించుకొనియున్నారు. నన్ను దుర్గాదేవి శాసించెను. మూర్ఛిల్లితిని. లేచినవెంటనే మూకత్వము గలిగినది.

కర్ణ—( చేతఁదీసుకొని పూర్తిగా చదివి ) "భగానువగానుసగాను తుగానుగగాను సగాను" ఆహా! ఎంత తెలిసెను? మొదటమనకుఁ దెలిసినంతకంటె నేమియుఁ దక్కువ కాకుండఁ దెలిసిపోయెను. శకునీ! ఇంకఁ జాలింపుము. ఈభగానుసగాను నీ వెక్కడ వెదకుదువు? రాజేంద్రా! ఆపాండవులకై యింతమనఃక్లేశమేల? వారి జ్ఞాతివిధిని సౌఖ్యముగ సహింపవే. పిదప వారు గలరు నాకోదండము గలదు.

( అనుబంధము 13 )

శకుని—కర్ణా! నీమతమెంత ధీరమతమైయునను, అవివేకమతము. కోటలు వెదకిన నేచుదుర్గుణము లేక నిరపాయముగ మనఁగలకాలసర్పములంబోలుపోని పెంచి వానికోఱలతో సాముచేసెదనందువే-దీనివలన నేంతమనకుఁ దెలిసెను. వారందఱు నొక్కచోటే యున్నారని తెలియలేదా? ఇదిచాలదా? లేకున్న నొక్కరొక్కరొ నొక్కొక్క వైపున వెదకవలసి వచ్చుంగదా?

( అనుబంధము 14 )

హాలాయుధా! వారుపోయిన-పురినీవు చూపింపఁగలవా! చూచియున్నావా?

హాలా—(లేదని సైగ)

శకుని—సుయోధనా! యోచింపనేల? ఒక్కటే యూర నొక్కసమయమున నొక తరుణియు నేవురు పురుషులును ప్రచ్ఛన్నముగవచ్చి యుండఁగలయూరి నరయఁబంపుము. ఒక్కక్షణమునఁ జిక్కఁగలరు.

( అనుబంధము 15 )

దుర్యో—చారులారా! సంగతులన్నియుఁ దెలిసెఁగా! మీరీక్షణమున వెడలి కార్యసాధనము గావింపవలయు.

చారులు — భాగ్యము. మేమవశ్యము నెఱవేర్చి బహుమతి వడయుదుము.

( అనుబంధము 16 )

శకు — ఈహాలాయుధు నింకను విచారింపఁదగియున్నది. ఎవరైన నొక్కరిచ్చ్యులు మొదలుక కాకీలన్నియు వస్త్రసరణియుగ్గడించుచు రావలయు-ఇతఁడొప్పుకొను వర్ణములవ్రాసిన నావాక్యమున మనకన్నియుఁ దెలియును. చారులారా! మీరాకింకను పొండు వుల గఱుతించు చందము చెప్పెదరఁడు.—

(యవనికఁ దిగఁజారును.)

(ద్వితీయాఙ్కము సంపూర్ణము.)

శ్రీ

# బృహన్నల నాటకము.

## తృతీయాఙ్కము.

### ప్రథమరంగము-విరాటపుర ప్రాంతాకాశభాగము.

---

[ ప్ర॥ సునందుఁడు-ఊర్వశి (ఆకాశమార్గము) ]

సున — అయిననితఁ డర్జునుఁడా? ఎంతరూపము మాఱినను దేజము కొఱవడకున్నదిగా?

ఊర్వ — నామాట వినఁదనఁ బొడమిన దుఃఖమిది, ఇంకనైనను వానిపై నాకు మనసుపో యకున్నది.

సున — అప్సరస్త్రీరమణివగునీ వొక్క మానవునిచేఁ దిరస్కృత వయ్యు నిట్లాడెదవా?

ఊర్వ — ఆహృదయశల్యము నిదివఱకుఁ బరిహరింపఁజాలకున్నాను. ఏమిది ద్రౌపది యిట్లు దుఃఖించుచు వచ్చుచున్నది.

సున — (ఆలకించి) ఆహా! కీచకునింటఁ గల్లు తేను విరాటసతియగు సుదేష్ణ యెంతవలదని ననుఁ బొమ్మనెననియుఁ దనపై మోహాతిశయమున్నదని ప్రకటించిన కీచకునొద్దకుఁ బోవ వాఁడేమొనర్చునో యని భయపడుచు—

ఊర్వ — సూర్యభగవానునిఁ బ్రార్థించుచున్నది గదా?

సున — ఇదెపోవుచున్నది. ఏమి కాఁగలదో?

ఊర — (కొంచెమూరకుండి) ఆహా! యీదురాత్ముఁ డీమె నెంతపరిభవించుచున్నాఁడు.

సున — అకటా! బలిమి మైచెట్ట బట్టెగా! నేనిపుడే పోయి వానిమర్దించి యాపతివ్రతామణిని రక్షింతును.

ఊర్వ — ఇదిగో యిదిగో! నీకంతయేల? సూర్యదూత పోవుచున్నాఁడు చూడు.

సున — ఆహా! ఇతని ప్రభావము! నిమేషార్ధమున వానిఁ బడద్రోసె.

ఊర్వ — అయ్యో! ఈపవిత్ర యెంతాతురమునఁ బరుగెత్తుచున్నది.

ముని — ఈ నీచుఁడును వెనుదగిలి పోవుచున్నాఁడు.

ఊర్వ — రాజసభకు వచ్చిరి. అకటా! ఆపాపి యీయబలనిట్లు పడఁదన్నెను.

ముని — వంటలవానివలెనున్న మహోగ్రాకారుఁడొకఁడెట్టిభయంకరపుచూపు చూచుచున్నాఁడు.

ఊర్వ — ఆహా! తెలిసెను. అతఁడే భీముఁడు. సన్యాసివలె గొలువునలంకరించి యుండెడి ఫలభూజమును వంటచెఱకులకై నఱుకఁదలఁచెనని సైగఁజేసి వానియలుక వారించు వాఁడె యుధిష్ఠిరుఁడు.

ముని — ఔరా! ఎట్టిధర్మాత్మునకట్టిపాటు!

శా॥ క్రోధంబేఁచిన నొక్కొక్కఁడొక్కఁడురణక్షోణిందలంకేసెఁ యా
వేదండంబుల నెల్లనుద్దవిడి నిర్వాణంబుగా వైరులన్।
సాహసంగలసోదరుల్ తపన తేజఃఖ్యాతులన్ గల్గియున్।
ఆ ధర్మాత్మజుఁడెట్టిపాటుపడె నాహా దైవకృత్యంబిలన్॥

ఊర్వ — కీచకుఁడు పోయెను. ఈ ద్రౌపది యెంతసకరుణముగాఁ దనభంగపాటు విరాటునితో విన్నవించెను.

ముని — ఏమిది? నాట్యమాడ నేలయని ద్రౌపదిని ధర్మజుఁడు వారించుచున్నాఁడు.

ఊర్వ — భళిర! ద్రౌపది యెట్టిప్రత్యుత్తరమిచ్చెను. తనమగలలో నొకఁడు నట్టువుఁడఁట

ముని — మీవాఁడేకదా?

ఊర్వ — వాఁడె. అన్నివిధముల నాపెడియె.

ముని — నా నపుంసకుఁడు వాఁడేమి చేయునో యింకే యుండి యుఱియుదును. ఈరమణీమణికి భంగపాటు వాటిల్లుటకింకేమియుఁ గారణములేదు.

ఉ॥ ఈరమణీలలామకిటు లేఁచిననెవ్వగలుప్ప తిల్లఁగా।
గారణమున్దలంపవిధి కార్యమటుండఁగ నీనపుంసకుం।
డీ సభవారుఁ డీయబలుఁ డీ యువిదేకి మగండుగాఁగఁదా।
బోరున గోరుచేకద నపుంసకునాలికి మేలుగల్గునే॥

అగఁధశౌన్య నామందబుద్ధి నాపుంస్త్వహీనుని బెండ్లియాడుటొక్కటియె.|

(అనుబంధము 17.)

పోయిమాతము. (నిష్క్ర. మింతురు.)

శ్రీ

# బృహన్నల నాటకము.

## తృతీయాఙ్కము.

### ద్వితీయరంగము-కీచకునిల్లు.

[ ప్ర॥ కీచకుఁడు. ]

కీచక — అకటా! ఏనేమి సేయుదును? ఎన్నఁడుగాని నాకు పుట్టని భ్రమము నేఁడిట్లు పుట్టఁజెల్లునే? ఇంత జేల తనము నాకుఁజెల్లునే? నేనువలచి చేపట్టిన వలదని త్రోయుకాంత, మున్నెందైనవినఁబడెనే? ఇంతతిరస్కృతుఁడనై యేలదానిఁ గాంక్షించుచున్నాను? ఏలపోయినదానినట్లే, పోనీఁజాలకున్నాను? దానిపతు లేవురు గంధర్వులు గలరని యదిచెప్పిన మాటనిజముగానుండ నోపు-వారెల్లరు దీనిననవరతము నేమఱకగాచు చుందురుగానుండు నోపు. వారు, భీమబలాఢ్యులగు టయు నిక్కము గానోపు. కాకున్న నే నాసతినిఁజేప్పటినప్పు డాగంతుకముగ నే తెంచి, నన్నొకగంధర్వుఁడు గెడపఁజాలియుండునే? అట్టిదానికై నేనేలబయిసి మాలవలయు. దానిఁజోలియే నామదికింకఁజేరనివ్వను. ఔరా! ఎట్టిమాటాడెదను. కీచకుఁ డింతదుర్బలుఁడని నన్నెల్లరు నవ్వరోటు? ఈభీరుత్వమునకైన నెడమేది? ఎవ్వఁడు నన్నుఁజెనకి బ్రతుకఁగలవాఁడు?

(అనుబంధము 18)

గంధర్వుఁడగుఁగాక-కిన్నరుఁడగుఁగాక-రాక్షసుండగుఁగాక-పంతమమాను నన దతనమురాఁదగునే. ఇప్పుడపోయి దానిఁబట్టిపెనఁగుదును. నాకెవ్వరీఁడు కాఁగ లరు? అదియుఁగాక దానిపై నాకున్న మోహాబ్ధి యతివేలమైయున్నది. నన్నును, నా లోకమును ముంచుచున్నది. దీనిమీఱఁగలనా? విశ్వమంతయు సైరంధ్రీప్రతిరూప మైయున్నది. ఏమాటవిన్నను దానినామమువలెనే యున్నదిగదా! ఈదేహమంతయుఁ దన్మయత్వము నావరించియున్నది గదా? నాయెడల నెందుఁ జూచినను దశ లక్షకోటి సైరంధ్రులరూపప్రతిబింబములు కనుపించుచున్నవి. నేనెట్లుదానిఁబాయఁ

గలదు? తియ్యనిపండ్లన్నియు, సైరంధ్రి యధరామృతముకంటెఁ జప్పిడిగాయుని తోఁచు. నిమ్మపండ్లఁగన్న సైరంధ్రి బటువుగుబ్బలపై బాళితీఱదు. (చేయిచూచుకొని) సైరంధ్రీ! నన్నేల యింత బాధించుచున్నావు? (మరియొకచేయిచూచుకొని) నీవొక సైరంధ్రివా! అయ్యో! ఇందఱు సైరంధ్రులుండియు నాపాలి కొక్క సైరంధ్రి లేకున్నదే? (కాలుచూచి) ఇందేలవచ్చితివి బంగరు బొమ్మా! నాకాళ్ళకేటికిఁ బట్టెదవు. నీచరణములంటి వేఁడుచున్నాఁడనే. (తనతొడఁగఱచుకొని) ఇప్పుడు గదా చిక్కితివి! హా! నీయాశ్లేషసౌఖ్య మెట్టిది? మఱలఁదప్పించుకొని పోయెదవా? నిన్ను విడుతునా? (బయలుకౌఁగిలించి) మానను-మానను-నీవేమన్నను మానను. (రెండువైపులముద్దిడి) ఈముద్దుకై యింతయగడుపడితిని. పోయెదవా? హా! సైరంధ్రీ! హా! సైరంధ్రీ! (మూర్ఛిల్లును).

(యవనిక దిగజారును)

---

శ్రీ

# బృహన్నల నాటకము

## తృతీయాఙ్కము.

### తృతీయరంగము-అర్జునుని రత్నశాల (ముందటి బయలు)

[ప్ర॥ ఊర్వశి సునందయును. (ఆకాశమున)]

సున—నిన్నరాత్రి వాయుసూనునితో ద్రౌపది విన్నవించిన కరుణారస విశేషము తలఁచుకొన్న నిప్పటికిని నామనంబున దుఃఖము పొడముచున్నది. జగద్వైరి సమూహాగ్ధనంతయు నాపోశనముగాఁ గొనగల వింధ్యభంజన ప్రతీపపకు లేవురు గలిగియుండియు నిట్లగునె?

ఊర్వ—ఏలయోచింతువు. నేఁడె తామసీనిశీథంబున వానిపని చక్కఁబడఁగలదు.

సున—ఏమిది? ద్రుపదాత్మజ యర్జునునొద్దకు వచ్చుచున్నది.

ఊర్వ—మారుతి నియోగమంతయు నీచెవిలోఁ జెప్పుకొనుచున్నది కాఁబోలు?

సున—సింహబలుఁడు నీయెడకు వచ్చుచున్నాఁడు.

ఊర్వ—దండకు వచ్చెను.

సున—పాంచాలి వెడలిపోయెను.

ఊర్వ—ఇఁకదేమి జరుగఁగలదో విందమురమ్ము. (ప్రక్కకుఁ బోయియుందురు).

(వెనుక యవనికెత్తఁగా సింహబలుఁడు బృహన్నలకాళ్ళపైఁ బడియుండును).

బృహ—సింహబలరాజేంద్రా! ఇది యేమియారడి.

కీచక—ఓ స్త్రీరత్నమా! నిన్ను స్త్రీరత్నమనవలయునో-పురుషరత్నమనవలయునో లేక నపుంసకరత్నమనవలయునో - నీకిష్టమగునదేదో యారత్నమా! నీవెట్టి కఠిన దుర్గసీమల నెట్టి ఘోరతపమొనర్చితివో యింత చెప్పుమా?

బృహ—ఏల?

కీచక—పూర్వజన్మమున నతులపుణ్యములు నీవే యొనర్చితివి.

బృహ—ఆదేల యిట్లడిగెదవు.

కీచక—అయ్యో! సైరంధ్రి-మా సైరంధ్రి నన్నుఁగాదను సైరంధ్రి-నన్నుఁగాదనఁజేయు సైరంధ్రి-నీసరిపసనిఁచు భాగ్యముగంటివే. దాని మృదుపదములు ధరించుటకు, నీధరణి - యీధరణి - యీధరణి - యెంతనోఁచినదో. (ముద్దిడి కండ్లకొత్తుకొని నమస్కరించును). అకటా! నేను నీవైనను గానయితినే?

కం॥ అమానినిననుమోమా।
భామామణికులుకు నడలు పలుకుల చాయలా।
కామిని గర్విచనుంగవ।
కామాంతమొందుఁగలుగుఁ గాంతలలోనన్॥

దాని చిలుకపలుకులు వాణిఁజంటితేనెనిగ్గలి జెలిపచ్చుటచే నేలతీయని పలుకులు. ఆస్యకమలములనుండి వెడలుటచే నంపుఁగలుగు పలుకులు. రదకుందముల యుండలు గలుగుటచే ముద్దులుఁగలుకుపలుకులు. ముద్దు నాలుక తిన్ననియదరువ జెలిఁజేరుటచే జిలిబిలిపలుకులు. నంభసాంభవ లక్షణకేలి పిసాళించు కలికిపలుకులు విన భాగ్యముగంటివే?

( అనుబంధము 19 )

బృహ—కీచకరాజా! నీకుఁ బ్రొద్దుపోదో! ఇట్లేల కలువరించెదు.

కీచక—తప్పుఁబలికితివి సుమా. కలువరము లేకయేకదా యింతగతికి నన్నాముద్దులాడి తెచ్చెను. నిద్రనైన నాయిందుముఖి సురతసౌఖ్యం బింతపొందదమన్న నానిద్ర లేకుండఁ జేసియున్నదే, బృహన్నలా! ఈచంద్రహారము గైకొనుము.

బృహ—ఇదేల?

కీచక—కైకొనుము నీకేల-ఈకడాణి బన్నసరముఁ గైకొనుము. నాప్రాణమే కైకొనుము.

బృహ—ఏల యిట్లాడెదవు?

కీచక—నీకును మాసైరంధ్రికినిఁ గడుఁ పరిచయమున్నట్లున్నది. ఏ యంతఃపురమునను నీప్రవేశమునకు నిరాటంకము. ఏచెలువయు నీకు సైఁపోదు. కరుణించి మా సైరంధ్రిని నాకుఁగూర్పుమా!

బృహ—హా! హా! హరిహరి. (అని చెవులుమూసికొనును).

ఊర్వ—(ముందటికివచ్చి) జగన్మోహనమనోహరాప్సరస్తరుణీమణి తానై వలచి పైబడిన వలదని త్రోసిపుచ్చిన నపుంసకుఁడిట్టిపనికైనఁదగండా?

కీచక—బృహన్నలా! ఏమిట్లు హరి-హరి యంటివి-హాహా! తెలిసెను. నీకును మా సైరంధ్రిపై మోహముగలదో! పురుషునకు సతికిందప్ప నపుంసనకే యామోహ నాఁగినైఁ దమివోడమెఁగా? అంతేల కేవల సతులేదానిం మోహింతురుగాదే!

బృహన్నలా! ఒకప్రాణికిఁ బ్రాణాపాయమువలనఁ దప్పించిన యుపకారము నీకు గలుగఁగలదు. నీచరణములంటి వేఁడెదను (అని కాళ్ళపైఁబడును).

బృహ—(ఏడ్చును).

కీచక—బృహన్నలా! నాకంటె నెక్కువగా నేడువసాగితివి. ఆహా! తెలిసెను. నన్ను మోహించి యున్నావేమో కదా? నీవు కామించిన నేనింకొక్కసతినిఁ గోరినందున జనించిన యీర్ష్యచేఁ జేయునదిలేక దుఃఖింతువో? రమణీ! నాపని మాత్రముచేయుము. దానిముద్దుఁగొన్న వెంటనే పూర్ణాధరపానమైన నాసింసక యేతెంచి నిన్ననంగక్రీడఁ దేలింతును.

బృహ—క్రూరకర్మా. తొలగిపొమ్ము. పలుమాటలు పలుమాటలాడిన, మచ్చాపమున-మచ్చాపమున నిను భస్మీభూతునిఁజేసెద.

కీచక—చాపమున-శాపమున, ఆహా-ఆహా-సైరంధ్రీ! యిక్కడికేవచ్చితివా? చిక్కితివి. తప్పించుకొనలేవు-విడువను. విడువను. (అని యర్జునిఁ గౌగిలించును).

బృహ—ఛీ! పాపాత్మా. (అని త్రోయును).

కీచక—గంధర్వుఁడు. గంధర్వుఁడు (అని దూరమున నెగిరిపడి మూర్ఛిల్లును)

ఊర్వ—ఈ పాపి కీచకుఁడు, నోఁచినపుణ్యము నేను నోమగా. బలవంతముననైన నాలింగనమువడసె. వీఁడో! నేనోఁచినపుణ్యము నోఁచినాఁడు. తెగడువడి క్రిందపడెను.

సున—ఊర్వశీ! మనమింకపోవుదము. ఏమి జరుగఁగలదో చూతము.

(నిష్క్రమింతురు).

బృహ—ఆహా! యీపాపిదైవమున కేమనవలయు. నాదుఃఖమున కేమనవలయు. నాపాటునకు దుఃఖింతునా? ద్రౌపది యీ కీచకునిచేఁ బడుపాట్లకు దుఃఖింతునా? ధరణిలో నెవ్వరికైన నిట్టిబెట్టిదంపు కట్టిడిపాటుఁగలిగెనే? అకటా! నాజన్మమింక నేటికి? రూపమువలననే కాక కార్యమునందును పౌరుషహీనత ప్రాపించెఁగా? ఈదుఃఖము నేనెట్లుతాళుదును. ఆహా ధర్మతనయా! మనకెట్టి భంగపాటు వాటిల్లె. రాజసభలో నీకాలి నొకనీచదురాత్ముఁడు కాల దన్న సత్త్వహీనునివలె నూరకుండు భంగిప్రాప్తించెనే! అంతటిమాననిద్ర కలిగెనే? అయ్యో! నాయన్నదమ్ములవలెఁ గాక నాకెట్టి భంగపాటువాటిల్లునే. నాకూరక ద్రౌపది పరిభవమునకు వోర్చుకొనిరిగాక నావలె వంతబడిరె. అకటా! ఈదురాత్ముఁడు నాతోడ నిట్టిప్రల్లదంబులు పలుకునే. నాసతీమణిం దనకు సమకూర్పనన్నిటడుగునె? హాదుఃఖము. హాదుఃఖము! నేనెవరితోడఁ జెప్పికొందును. నావగ నెవ్వరుతీర్చువారు, నా హృదయశల్యము నెవరు వెలిపుచ్చువారు. ఈకలుషాత్ముఁడు నన్నే యిట్లు పరిభవించెఁగదా? ఇకద్రౌపది నెట్లు చేసియుండఁడు? అయ్యబల యెంతదుఃఖపడెనో! ఆసంతాపభరము నెట్లు తాళుకొనెనో? అనువులభరించి యెట్లుమనెనో! హా! ఊర్వశీదేవి! యిట్టిపాపపు

శాపము నాకిత్తువె? నను నిట్లుపరిభవింతువే - నాజితేంద్రియమునకా యీబహుమానము. అండజీవలె నేనున్న నాకీకుందు లేకుండెఁగా? అటుగాక యీహేయరూపమునఁ గలిగినందునఁ గదా యీనీచునితో నిట్లనిపించుకొంటిని. అకటా! ద్రౌపది వచ్చి నన్ను నీకీచకుం డేమనెనని, నే నేమని వచింతును. ఎట్లు దానికి ముఖము చూపుదును!

సీ॥ కన్నులారఁగ నింత కష్టకృత్యముఁ జూచి
యుడుకున్నై నెటు లూరకుండువాఁడ ।
ఉండెదఁగాక యాయుచిత పాటులకెల్ల
నోలువారఁగ నెట్లు తాళువాఁడ ।
తాళుదుఁగాక యింతనె చేరనేతెంచు
ద్రౌపదికెటు మోము చూపువాఁడ ।
చూపుదుఁగాక యాసుదతి కీచకుఁ డేమి
చెప్పెనన్నను నేమి చెప్పువాఁడ ।
తే.గీ॥ కటకటా వైరులకునైనఁ గలుగవలవ ।
దీతిరస్కారదుఃఖ మజ్ఞాతవాస ।
మునకు బహుకాలవనవాసమునకునైనఁ ।
దాళితింగాని యిది తాళఁజాలఁజాల ॥

హా! దైవమా! నన్ను నీ వెంత చేసితివి! రాజ్యభారవహనముఁ బాపి యరణ్యసామ్రాజ్యమునకుఁ బట్టముఁ గట్టితివి. చాఁడిక్కి మిఱుమిట్లుగొలుపు స్వభాను తేజముఁ బాపి యూరుపే రెఱుఁగకుండునట్లు చేసితివి. శరణాగతాభయదానశౌండములును ధనుర్జ్యాకిణాంకములును శరచాపాధికప్రవీణములు నునగు కరములకుఁ దాళము లిచ్చితివి. పరాభేద్యాంచితవర్మ సముదారంబగు మేన పయ్యెదఁ బలిగించితివి. వైరిరాజన్యనారాచప్రమోహ వజ్రాదిప్రతీపంబగు నురమునకుఁ గంచుకము దొడిగించితివి. మహేంద్ర వరప్రసాదప్రభవానంతమణీరాగరాజత్కిరీటమునకు మాఱు శిరోజాత కిరీటము నిచ్చితివి. రాజరాజాంగవిద్యాప్రవీణత నలరారు మంత్రసంవాదములఁ బ్రబోధించునోట స-రి-గ-మ-ప-ద-ల నిల్పితివి. వినియుక్త బాణధనుర్గుణ యుక్తకరాంగుళీసమాలంకృతంబులగు శ్రవణంబులఁ బ్రవాళకీరపత్త్రముల నలంకరించితివి. ఘోరరణకంకణాంచితములగు మణిబంధములకు గాజులఁ బెట్టితివి. ఇంతయ్యు నీపగ దీఱదో. ఏలనన్ని క్లేచుచున్నావు-హా! నిగ్రహము-నిగ్రహము కీచకా! కీచకా! సర్వాలయములనుండు దైవతములారా! ఓషధీసిద్ధులారా! మారమణ మంత్రౌషధము నిచ్చి నా కష్టము నంతము చేయరాదా? హా! ద్రౌపది! ద్రౌపది!

యవనిక దిగజారును. (మూర్ఛిల్లును).

శ్రీ

# బృహన్నల నాటకము.

## తృతీయాఙ్కము.

### తురీయరంగము-విరాటన ర్తనశాల.

---

[ ప్ర॥ సునందుఁడు ఊర్వశి. ]

ఊర్వ—ఇక్కడనే యొకచోట నుందము.

సున—అవును, నేడు కడువినోదము జరుగఁగలదు. భీముఁడును, నీకీచకుఁడును మహాబలయుక్తులు. వారిరువురియుద్ధము కన్నులకుఁ బండువుగావింపఁ గలదు.

ఊర్వ—అదిగో చప్పుడు వినుపించుచున్నది. భీముఁడును ద్రౌపదియు వచ్చుచున్నారు కాఁబోలు. (ప్రక్కకుఁ బోవుదురు. )

[ ప్ర॥ భీమసేనుఁడు-ద్రౌపది. ]

భీమ—ప్రియా! ఇయ్యెడనే మనోహరముగానున్నది. ఇదియే యిక్కడ మెత్తనేసి యున్నట్లున్నది.

ద్రౌప—కీచకుని సేవకుఁడు నాకొఱకు వేసియున్నట్లున్నది.

భీమ—అయిన మేలాయె. వాఁడిందువచ్చుననుటకు సందేహము లేదు.

ద్రౌప—సందేహ మేమియు లేదు.

భీమ—అహా! ఇట్టి దుష్కలుషుఁడు మంచెన్నఁడైనవినఁబడెనే? వానిఁజూచి నే నహింపఁగలనా? సప్తలోకముల కలగుండువెట్టఁజాలు అంకెయొకటివైచి గరుడుఁడు పన్నగముల నొడిసిపట్టినట్టు లాక్రమించి మెదపి యొకముద్దచేసి వికటుని పత్ని సుదేష్ణమ్రోలవైచి వచ్చెద. అందనకేమైన విటుఁడడ్డమాడవచ్చిన వానిం బొరపుచ్చెద.

ద్రౌప—భీమసేనా! అట్లయిన నీసాహాయ్యము వలదు. నాగతికొలది పోయెదను.

భీమ—దేవీ! అదియేమి.

ద్రౌప — మనగుట్టు వెలివడుంగదా ! అప్పుడు మనము మరల పండ్రెండు సంవత్సరము లడవి కేగవలయు నే. ఆ యపకీర్తియంతయు నాతలనై నిల్చుగదా ?

భీమ — కామినీ ! నీ వేలభీతిల్లెదవు ? నో మా వేశమున నిట్లంటిఁగాక సమయభంగ మొనర్చి మరల సాధర్మాత్మజునికి సంతాపము గలిగింప నేనట్టివాఁడనా ?

ద్రౌప — అట్లయిన నొప్పుకొంటిని నాథా ! మనకట్టి సంతాపముగలిగె. శక్తియుండియు శక్తి వెల్లడిచేయుకార్యము నొనరింపకయుండవలసెఁగా ? అయ్యో ! ఆమరాత్ముఁ డేతెంచి నీయెదుట నను పలుమాటలాడనున్నాఁడుగదా ? దాని నీవు వినవలసె- నీవు వినుట నేఁజూడవలసె.

భీమ — అతివా ! ఇందుకు సంతాపమేల ? నే వాఁడువచ్చినవెంటనే పొరిగొనను. ఏమి మాటలాడనున్నాఁడో చూచెదను. కొంత సేపు వినోదముల జరిపి నీకు ముదము గలిగించెదను.

ద్రౌప — అయ్యో ! అది యేమియు వలదు. ఆ చండాలుని దుర్మార్గోక్తుల నీ వేల వినవలయు ?

భీమ — అటు కాదు. నాకేమో కుతూహలము గలిగెను. నామాటకు మారాడకుము. ఈశయ్యనే శయనించి యుండెద. నీవట్లు దూరముననుండుము.

ద్రౌప — అయిన నీయిష్టము.

భీమ — దేవీ! ఒకవేళ నేను నాకీచకుఁడును బోరాడుటలో వాఁడేనను జయించిన నెట్లు ?

ద్రౌప — భీమసేనా ! నేఁడేమిచిత్రము. ఇట్టిమాటల నీనోట వింటిని ?

( అనుబంధము 20. )

భ్రుకుటిమాత్రమున ముజ్జగంబులఁ గలఁపఁజాలు నీయట్టివాఁ డిట్లులాడునే ? నాకుఁ జూడ నూరక నా మనసరయఁగోరి వేడుకకడిగితివని తోఁచెఁగాక, మనసార నీవిట్టి భీరుభంగి నుగ్గడించితివని నేనమ్మను. ఒక కిమ్మీరహిడింబులలో నీతుచ్ఛ పాపుఁ డెక్కుడి కెక్కును. అదిగాక ధర్మదేవత సాక్షాత్కరించి జనియించి నట్లు త్రిజగంబుల నజాతశత్రుఁడని పేరొందిన యమతనూజుని పోష్యవర్గమున నున్న మనకుఁ జేటెన్నటికైనఁగలుగఁగలదా ! అంతధర్మము పాడగునె ? అయినను వేడుకగా నీవడిగితివగానఁ బ్రత్యుత్తరమిచ్చెదను. ఇది యీమూఁడును కటారి. ఇది యొకరి ప్రాణము తీయుటకు నిస్సందేహముగఁ జాలియున్నది. యీయాయుధ మున వాని ప్రాణమొండె నా ప్రాణమొండె కడతేయఁజాలుదు.

భీమ — (ద్రౌపదిని కౌగిలించి) ఇప్పుడు నామది కెక్కె. ఇప్పుడుగదా నీవు వీరపత్ని వౌటకు సార్థకము. ఊరకయంటిఁగాక యాదురాత్ముఁడు నాకెంత. ఒక్క

సమీపమున వానినక్కడికిఁ బంపలేనా? అది సవ్వడి వినవచ్చె. నీవు దూరమున నుండుము. కాదు. దాపుననే యుండుము. (ద్రౌపది మరుగున నుండును.)

[ ప్ర॥ కీచకుఁడు (భృత్యులతో). ]

కీచక — (స్వగతము) సైరంధ్రి వచ్చియుండునా? ఏలవచ్చియుండదు. అదియేమి మనవస్త్రీ కాదా? నా సురూపమునకు మరులుగొని యుండదా? నేఁగోరితయునాకిక మొనర్చితి. మీఱరాని మోహావేశమున సమయము గుఱుతెఱుఁగక యట్టైనఁ బడనుద్యమించితి. ఎంతనురూపసంపత్తిగలవాఁడనైయుండినను దానికి నన్నుఁ జూచినంతనే యెంతబాలి పైఁబోడమినను, అంత హూటాహుటిక్రియను సమ్మతించునా? వివేకినై కొంతవకాశమిచ్చియుండిన నాకోర్కె ఫలించుచుండెను. ఇంతరంతును దప్పుచుండెను. అయినదయినది. ఇప్పుడేలయోచన లోనికిఁ బోయెదను. (పోయితిరిగివచ్చి) ఆహా! ఎంతచీఁకటిగానున్నదీయెడ. ఇట్టి సంకేతమునకే నియమములఁతో నన్నేలయాతన్వాఁగిరమ్మనియె. చీకటింటనేల యభిలషించె ఆహా! తెలిసెను. ఈతరుణీమణి యెందెందును వేఱొక్కరికి లభించినట్టులేదు. నా భాగ్యవశమున నన్ను మాత్రము మోహించియున్నది కాని, యీ క్రియఁ దానికి బరిచితముకాదు. ఇప్పుడెపోయి దాని గాఢాలింగనము వడయుదునా! (మరలదిరిగి) ఏమిది యీయింట దూరవలయునన్నఁ జంకుకలుగుచున్నది? దీనియందేమైన మోసముండునా! దానిపతులు గంధర్వులిందేమైనఁ జేరియుందురా? ఆహా! నేనెట్టిభ్రాంతుఁడను! గంధర్వులేయుండి, వారు బలిష్ఠులేయైయుండిన నీచోటికేల రావలయు. నాయింటనే నన్ను నిర్జింపలేరైరా? ఈసైరంధ్రి నన్నేల మోహించిన మాటలాడవలయు? ఇదియంతయు నూరక పనికిరానిసంశయము. ఊరక బెగడొందుచున్నాను. ఎన్నఁడును నిట్టి చోరరతిసౌఖ్యమెఱుఁగనివాఁడనగుట భీతిల్లుచున్నాను. పోయెదను. (పోయి) (మెల్లఁగా) సైరంధ్రీ! సైరంధ్రీ! ఏమి పలుకకున్నది. (కొంచెము గట్టిగా) సైరంధ్రి! సైరంధ్రీ.

భీమ — (మెల్లగా) "ఊఁ" (అనును)

కీచక — వచ్చియున్నావా బంగరుబొమ్మా! నీవేల రాకయుందువు? అయ్యో! నాకొఱకెంతసేపు కాచియుంటివో క్షమింపుము.

భీమ — నీకొఱకే కాచియున్నాను.

కీచక — దేవీ! నా భాగ్యమునకు సమానములేదు. ఇదే నీకుఁ దనివిదీఱుభంగి రమణీయములగు ఫలాహారముఁ దెచ్చియున్నాను. స్వీకరింపుము. ఇప్పుడైన స్వీకరింపుము —పిదపనైనఁగానిమ్ము.

భీమ — పిదప స్వీకరించిన నీకేమి మాడఁగలవా! ఇప్పుడె తెమ్ము.

కీచక — కొమ్మా! ఈచీకటింట నీకేమిగోరిక, యేమానందము? కొంచెము వెలుతురు దెత్తునా? వెలుతురునైన నీమనోహరాంగసౌందర్యమింకను రమణీయముగ నుండునే?

భీమ — అయ్యో! వలదు. నాయంగసౌందర్యము నీవు వెలుతురునఁజూచిన భీతి జనించెడు.

కీచక — నీకా! భీతియా! అయ్యో! నీదాసుఁడనై చెప్పినకార్యము శిరసావహించి చేయుచు నామరణము నిను బాయకుండువాఁడనే. అటు బాసచేయువాని గురించి నీకేలభీతి?

భీమ — అయిన, నామరణము నను బాయవా?

కీచక — సంశయించెదవా? కావలయునన్న నామనసైనఁజూపుదును. నే నంగీకరింపనని నీవుమాత్రమనుము. నీయెదుటనే మృతిఁజెందెదను.

భీమ — మృతికొఱకంతయేల? మృతియె రావలయునన్న నే నంగీకరించిన మృతిగలుగదా?

కీచక — తరుణీజనవతంసమా! నీమాట నాకభేద్యముగానున్నది. సిగ్గరివై యేమేమో మాటలాడుచున్నావని తోఁచుచున్నది. సిగ్గువదలుము. నిక్కము నే నీవాఁడఁగా కన్యులకుఁ జిక్కను. నీవు నాచెంతనున్నఁజాలు. స్వర్గమున నూర్వశీసంభోగమునైన సరకుకొనను.

భీమ — స్వర్గమున నున్న నూర్వశిని జూడవలయునని నీకంతభిలాషమా?

కీచక — తరుణీ! ఆయూర్వశి నీకాలిగోరికైన సాటియగునా?

భీమ — ఏల! నీకాయూర్వశియే సిద్ధించుఁగాని లెమ్ము. పిలుతునా యూర్వశిని?

కీచక — అయ్యో! దేవీ! నీకంతకోపమా? లోకమున నందఱు నూర్వశి కడుముద్దులాడియని పలుకుచుండఁ బ్రస్తావవశమున దానిపేరెత్తితినంతయే. అంతయసూయయా? కైకొనుము ఫలాహారముల వీని రుచియయినఁజూడుము.

భీమ — (తినఁబోడగును.)

కీచక — తరుణీ! నన్ను నేనప్రశంసించుకొననేరను. నన్నుగాంచిన తరుణులందఱు నాయట్టి పురుషుఁడు లేఁడని యగ్గించుదురు. అట్టివాఁడ నీకు దాసుఁడనైతి. నీభాగ్యమెట్టిదోకదా!

భీమ — ఇంక నన్ను నేనప్రశంసించుకొనవలయునా? ఈ భూమండలమున నాయట్టి సతిని నీవకాకింకెవ్వరునుఁజూచియుండరు. అట్టి నాసరసకేతెంచి తుదగాంచఁగంటివి. నీప్రాప్తమెట్టిదోకదా?

కీచక—ధళిధళి! నీవట్టిదానవే యగుదువు. ప్రియా! నీవే భుజింపవలయునా యీ ఫలాహారముల? నీముద్దుచేతుల నాకింతయొసఁగరాదా?

భీమ—కొమ్ము (అని కన్నుపొడుచును.)

కీచక—(కన్నుల నులుముకొనుచు) అయ్యో! కాంతామణీ! నాకన్నేటిగాఁ బొడిచితివి?

భీమ—చీఁకటి. నీకింత సమీపమునకు వచ్చియుండుట నీవైన నెఱుఁగుదువా? అయ్యో! వచ్చిరాకయే కన్నుపోయిన నుండెట్లు?

కీచక—నీకేమియు భీతిల్లకుము. ఏమో కొంచెము తగిలెఁగాని, బాధయేమియు లేదు.

భీమ—ఊఁ—

కీచక—అయినా ఫలాహారము?

భీమ—కొంచెము—(తినును.)

కీచక—దేవీ! ఇంతదూరము నీకొఱకై వచ్చి యింతసేపు నీసరస వసించియున్నను నాలింగనమియ్యకున్నావేల?

భీమ—ఫలహారములు ముగియవలెనా వలదా?

కీచక—తరుణీ! నీచందము వింతగానున్నది. కోయిల నాకర్షించు పలుకులుగల నీకు నిట్టి కటుభాషణంబులేలకలిగె. ఫలాహారముపైఁ జింత యెంతయు నున్నట్లు తోఁచెఁగాని నిన్నే నమ్మి నీ చరణదాసుఁడనైయున్నవాని మఱచినట్లున్నది.

భీమ—ఇంక కొంచెము ఫలాహార శేషమున్నది. నిలువుము. నీపని తీర్చెదను. నోట భక్ష్యములున్నప్పుడు కటుభాషణంబులు నీకొఱకై కాకుల నాకర్షించు మాటలు కాక, కోయిలల నాకర్షించు పలుకులు గలుగునా?

కీచక—నాకాలింగనమిచ్చి నీఫలాహారముంజేయరాదో? ఆహా! తెలిసెను. నీకు లజ్జ విశేషముగానున్నందున నీవైమున్నాడి యాశ్లేషింప సాహసింపవు కాఁబోలు. అయిన నాకు సెలవా?

భీమ—ఇప్పుడె నీకు సెలవిచ్చెదను. (లేచిపట్టును.)

కీచక—గంధర్వుఁడు! (పట్టుకొనును.)

(ఇరువురు మల్లయుద్ధమొనర్చెదరు కీచకుఁడు క్రిందపడి చచ్చును.)

భీమ—కాంతామణీ! ఇటురమ్ము. చూడుము. నీకుఁ గీడాచరించిన పాపాత్ముని.

(వెలుతురున తెచ్చి చూచెదరు.)

ద్రౌప— (కీచకుని గాలదన్ని.)

( అనుబంధము 21 )

భీమ— నా ప్రేమయు స్తుతిపతను. ఇదె తెల్లవారవచ్చె. స్నానమునకుఁ బోవలయు. నీవు నిశ్చింతగాఁ బొమ్ము.

(ఆశ్లేషించికొని నిష్క్ర.)

[ ప్ర॥ ఊర్వశి. ]

ఊర్వ— అమ్మా! ద్రౌపదీ!

ద్రౌప— ఎవరది? ఎవరది? నాథా!

ఊర్వ— అమ్మా! నీవు భీతిల్లకుము, నేనే యూర్వశియను దేవవేశ్యను. (చెవిలోఁ జెప్పి) ఈకారణమున నీ యొద్దనుంటిని. నీయట్టి పవిత్ర చరిత్రను దర్శించుకొనక పోవుట యుచితముకాదని నీకుఁ గనిపించుకొంటి. నీయద్భుత పాతివ్రత్యము గాదే నిన్నీ పాపముల వలనఁ దప్పించెను. నీకెప్పటికిని నిర్భయము. నేఁబోయివత్తు నానతిమ్ము.

ద్రౌప— ఊర్వశీదేవి! నాయెడ నీప్రేమ నిర్వ్యాజముకదా.

( అనుబంధము 22 )

(నిష్క్రమింతురు.)

—( తృతీయాఙ్కము సమాప్తము. )—



శ్రీ

# బృహన్నల నాటకము.

## తురీయాంకము.

### ప్రథమరంగము-కౌరవసభ.

[ ప్ర॥ దుర్యోధన-కర్ణ శకుని-చారుండు. ]

దుర్యో—చారులారా ! వారినెక్కడ పెట్టియున్నారు.

చార—భోజనమునకుఁ బోయియున్నారు. రాఁగలరు..

దుర్యో—వారే పాండవులని యెఱుఁగుదురా ?

చార—వారుకాకున్న నింకొక్కరుండరు. ఎందుకన్న విరాటపురి - కుంతలపురి యీ రెండుపట్టణములఁదప్ప భూలోకమున మఱియొక్కచోట నాల్గురు జనులు నవీనాగతులై యొకసారివచ్చినవారులేరు. మేము తెచ్చినవారు కుంతలపురమున నుండినవారు. విరాటపురినన్న నేవురు పురుషులు నొక స్త్రీయు కాక నలువురు పురుషులును నిరువురు స్త్రీలును వచ్చియుండినారు. కావున వారిని మోసవలసి వచ్చెను.

[ ప్ర॥ ఏవురుపురుషులు-విధవ. ]

( అనుబంధము 23 )

1. పురుష—అయ్యో ! అయ్యో ! ఏ మన్యాయము ! ఇట్టి వేదురుపట్టిన దురాత్ముల జగంబున నూరకవిడువఁజన్నె - నేను ధర్మరాజునఁట! ధర్మరాజునకిట్టే కష్టజాడ్యము కలిగియుండెనా ? రాజేంద్రా ! చూడుము.
2. పురుష—నేను భీముఁడఁట ! నాకొక ద్రోపదిఁ దెచ్చియివ్వకపోయిరే ?
3. పురుష—నేనర్జునుఁడఁట ! ఇదిగో నా గాండీవమునుఁ జూడుము. (మెడలోనున్న రుద్రాక్షహారము నిచ్చును.)

1. పురుష — నేను నకులుఁడు. నకులమనఁగా ముంగిస-ఇదిగో నాయనుఁడ తమ్ముని సహదేవునిఁ జూడుము. (ఒక పెద్దవానిఁ జూపి నవ్వును.)

2. పురుష — నేను సహదేవుఁడను. ఈమె మాతల్లి మాద్రికాఁబోలు? పాండురాజ శవమును దహించినవెంటనే ప్రాణ్ఛేదించుకొని పాతుతెంచిన మగఁడులేని ముత్తైదువ యీబిడయే సుమా?

విధవ — నేను విధవను. నన్ను మాని దేశముపైఁ బోయియున్నపుత్రు నన్వేషించుచుఁ గుంతలపురికివచ్చి యశక్తనైపడితిని. వీరు ధర్మగుణముచే నాకింత పరిచర్య సేయుచుండిరి. రాజా! నీచారులు నాకేపురుషతులఁ గల్పించిరి. నేను ద్రౌపదినఁట! అయ్యో! ఆమెకెంత యవస్థవచ్చెను. నీఁడలేక కొడుకును బోవఁగొట్టుకొని విలపించుచున్న బ్రాహ్మణ విధవయాయెఁగా?

దుర్యో — ఇది కడుచిత్రముగానున్నది.

చార — దేవా! వీరేపాండవులు. వారు తమసమయభంగము కాకుండుటకై యెట్టి బండతనపైనఁ బైవేసుకొనఁగలరు.

అందఱు — కాదయ్యా! కాదయ్యా!

దుర్యో — కానున్న నేమినష్టము. నెల రెండునెలలు మిమ్ము నిర్బంధముననుంచెదను. పాండవులు వచ్చినవెనుక విడిపించెదను. రాకుండిరా! మిమ్మునే మరల నరణ్యము నకుఁబంపెదను.

అందఱు — అయ్యో! అయ్యో!

శకుని — సుయోధనా! నాకొకటి తోఁచుచున్నది. ఇదివరకు విస్మృతుఁడైయుండిన హాలాయుధాసురుఁడు నేఁడు కనువిచ్చియున్నాఁడని వింటిని. వానిఁబిలపించిన వాఁడు చెప్పఁగలఁడు.

దుర్యో — సేవకా! హాలాయుధాసురుని దోడ్తెమ్ము. మాతులా! వీరేపాండవులుగానుండనోపుదురని తోఁచెడు. విరాట-కుంతలపురముందప్ప నింకెక్కడను వారుండఁజాలరుగదా? విరాటపురి నిద్దఱు స్త్రీలుండుట నందు వారులేరు. అదియుఁగాక యాపురంబునఁ గీచకుఁడను పటుబలాఢ్యుఁడు విరాటుని మఱఁదియున్నాఁడు. అట్టియెడ వారు పోవరు.

చార — దేవా! ఒకవిన్నపము. దేవర కీచకుఁడన్న జ్ఞప్తిగలిగె. వాఁడొక సైరంధ్రిపై దుర్మోహముఁగలిగి తత్పతులగు గంధర్వులచే నొక నిశీథమునఁ దన నాట్యశాలలో [illegible]లో వధింపఁబడెనని మేము విరాటపురి విడిచిన పిదపఁ దెలిసెను.

దుర్యో—ఏమీ! ఏమీ! కీచకుఁడు-భీమసేనుఁడు-శల్యుఁడు-బలరాముఁడు - వీరు సమజులు.

[ ప్ర॥ హలాయుధుఁడు. దీనుఁడై. ]

హలాయుధా! పాండవులిట్టి వేషముల నేమైన ధరించిరా?

హలా—(కాదని సైగ.)

దుర్యో—వారు విరాటపురికేమైనఁ బోయిరా?

హలా—(ఆశ్చర్యమున ఔనని సైగ)

దుర్యో—హలాయుధా! పొమ్ము-జనులారా! మీరును యథేచ్ఛముగఁ బొండు. మాతులా! ఇంక యోచనయేటికి-ఆ సైరంధ్రియే ద్రౌపది గంధర్వులే పాండవులు వారిని మనమందఱ మవశ్యము గుఱుతింపవచ్చును.

ఉ॥ నిండుమదంబు మానక జనించు విరాటుని ప్రోలువారలే।
పాండవు లావిరాటుఁడును వైరియగు న్మనకింక వానిగో।
మండలిఁబట్టి వారలభిమానమదంబునఁ బోరవత్తురా!
భండనసీమవారిఁ గనిపట్టి వనంబున కంపనింపగున్ ॥

( అనుబంధము 24 )

విరాటుని గోధనము మిక్కిలి బలిసియున్నట్టువినికి. అతఁడు మనశత్రువుఁడు. ఇదే సమయము. సుశర్మను దక్షిణముననున్న గోవులఁబట్టఁబంపుదము. వానితో విరాటుఁడు యుద్ధమునకువచ్చును. మఱునాఁడు మనమందఱ ముత్తరమునఁ బట్టుదము. అప్పుడు పాండవులే వచ్చెదరు. అట్లను రాకుండిరా మనము ముట్టడించినపుడొక్కింత సైన్యము నూరిపయికిఁ బంపుదము. వారు చిక్కకమానరు. కర్ణా! నీవాయితముగమ్ము.

కర్ణ—నాతోడఁ జెప్పవలయునా! పాండవులందఱటుండనీ. అర్జునుఁడు మాత్రము వారితో వచ్చెనా యపుడుగదా నాపండువు.—

కం॥ ఏపార శేఁపెపోదము।
కోపాటోపంబువెలఁయఁ గుంతిసుతులలో।
నాపార్థుఁడొకఁడువచ్చిన।
నాపండువుగాదె మనుజనాయకచంద్రా॥

శకుని — ఇంక మనమాచార్యాదులనెల్లఁ బురికొల్పెదము.

మ॥ మనసారంగను నిరంతసంతసము సంపాదింపఁగాఁగల్గునే !
ఘనదుఃఖంబులు దీఱెనంచు మదిలోఁగర్వించియున్నాఁడుగా !
వనభూమింబడ గూఢభంగి మఱియుం బ్రాణాంతమోండేల్లు పం!
చినఁగాదే చిరరాజ్యముబ్బునృపతుల్సేవింప దుర్యోధనా ॥

( అనుబంధము 25 )

(నిష్క్రమింతురు.)



శ్రీ

# బృహన్నల నాటకము.

## తురీయాఙ్కము.

### ద్వితీయరంగము - ద్వారక.

[ ప్ర॥ కృష్ణుడు - అభిమన్యుఁడు. ]

---

అభి — మాతులా! నీకనుగ్రహము లేకున్న నేనేమి చేయుదును? నా యుత్సాహభంగము చేసినందున నేమిఫలము.

కృష్ణ — అభిమన్యూ! ఊఱడిల్లుము. ఇంకొక నెలదినములలో నీతండ్రులు రాఁగలరుగదా నీకేల యాతురము.

అభి — అజ్ఞాతవిధి తీఱినదినముననే యానందబాష్పములు నిండార మాతండ్రు లాశ్లేషించుకొను నభిలాషముగదా నాకు? లోకగర్భుండవై నీవెఱుఁగని రహస్యమేమున్నది. నీవు చెప్పకున్న నాగతికొలఁది నెందైన వెడలెదను.

కృష్ణ — (ఆత్మగతము) ఈ కుమారుఁడు ననుమిగుల బాధించుచున్నాఁడు. వీనికిఁ జెప్పిన మాత్రమున నందేమియుపాయము (ప్రకాశము) కుమారా! నే నెంతచెప్పినను మానక మొఱకుదనమున బలవంతమొనర్చెదవు. రహస్యము మాత్రము వెలిపుచ్చితివా, మహాపాయము సుమా!

కం॥ పాపఁడవై మాణవక ।
వ్యాపారము వెలయనిట్టు లడిగెదఁ గాదే ॥
యోపాటు వెదకిఁ దెలియుము ।
హాపాయము గల్గ నింత యారటు వేలా ॥

శ్రీ

# బృహన్నల నాటకము.

## తురీయాఙ్కము.

### తృతీయరంగము-విరాటోద్యానము.

( మండపము-భావి. )

[ ప్ర॥ అభిమన్యుఁడు. (బ్రాహ్మణరూపమున) ]

అభి — మా మేనమామయగు కృష్ణునితోఁ బాండవులు విరాటపురి నున్నారని బలవంతపెట్టి యెఱిఁగి యిందువచ్చితి. ఆహా! రథమువిడిచి యొక క్రోశమయినను నడిచిరాలేదు. ఇంతాయాసమగుచున్నది. నాతండ్రులింకెంతకష్టమొందుచున్నారో. ఈ ఉద్యానము మనోహరముగానున్నది. రాజులు లేక వనభోజనమునకుఁ బోయియున్నట్లు తెలిసె. ఆ మండపమున నీరాత్రియంతయునుండి రేపు రాజదర్శనమునకుఁ బోయెదను. ఆయాసమున నిద్రవచ్చుచున్నది. (పండుకొనును.)

[ ప్ర॥ ఉత్తర-నీలా. ]

ఉత్తర — నీలా! సాయంకాలమగుచువచ్చెను. ఇంకను, ఎండబలిసియున్నది.

నీలా — చూచితివా-యీసరోవర మెంత రమణీయముగానున్నది. ఇందింత స్నానము సేయుదుమా?

ఉత్తర — మిగుల మేలు. అయిన మాఱుచీరలైనను లేవే. నీలా! పోయితెత్తువా?

నీలా — మీ వారున్నచోటు దూరమె. నీవొంటిగా నెట్లుండెదవు.

ఉత్తర — నాకేమి భయము. నీవు శీఘ్రముగఁ గొనిరమ్ము.

(నీల-నిష్క్రమించును.)

ఉత్తర — నీల వచ్చువఱకు నందున్న మండపమున విశ్రమింతును.

(పోయి, బ్రాహ్మణరూపముననున్న యభిమన్యునిజూచి.)

ఆహా! ఏమహోత్కృష్ట పురుషుఁడు. అనవరతాకాశగమనాయాసమున ధరణీతలమునకు దిగివచ్చి సుఖశయనము నొందిన చండభానుఁడో — ప్రణయ యోగంబున రతీసతి తిరస్కారము గాంచి తదాహ్వానాకాంక్షుఁడై కోపమువగలం బండియుండు మీనకేతనుఁడో — స్వకాలసంజనిత సంభ్రమంబునం దనపరిణతియంతయుం దిలకించి మహానందమున మేను మఱచియున్న వసంతుఁడో — భూసతీసమాగమకాంక్షచే నేతెంచి రతాంతశ్రాంతుఁడైన మానవుఁడో — యగుఁగదా. కానున్న నీతేజంబుం బెంపు, రూపవైభవము, విలాస మనోహరత, యాభోగవిభ్రమము నెట్టిదైన నుండునె.

ఉ॥ ఈనిమువాలుచూపునగ యీనిబలాఢ్యహిమాంశువిభ్రమం।
బీనగుమోముపోయగము నీ వెడఁదైనయురంబుపొంక మీ।
మానితబాహుదీర్ఘతయు మాయురె యీనవ మోహనాకృతుల్।
గానఁగదా తలంప నవకాముఁడొ లేక యిలేందు సోముఁడో॥

( అనుబంధము 26. )

అకటా! రాజకంఠీరవుఁడగు విజయకుమారుఁడై నాకు పినుకలిచే నుత్పన్నమయిన మోహావధి యంతకంతకు నింకిపోవుచు వచ్చెగా?

(ఒకపాముముత్తర వెనుకనుండి రభసముగా వచ్చును. ఉత్తర తిరిగిచూచి హా! యనియరచి మూర్ఛిల్లును. అభిమన్యుఁడు లేచిచూచి పామును జంపును)

అభి — అకటా! ఈకాల సర్పమీయంగనామణిం జంపుచుండెఁగదా! ఈ సతీమణి యెవ్వతయో. చంద్రునరయుచు ధరాతలమునకుం దిగిన రోహిణియో? వసిష్ఠుని వెదకుచువచ్చిన యరుంధతియో? సాక్షాత్కరించి తరుణీరూపముఁ బూనిన వనలక్ష్మియో యగుఁగదా?

సీ॥ ఖండరూపములేక నిండురూపమెయెల్ల
కడలఁ జందురునకుఁ గలిగెనేని।
తాకితాకకమున్న దాడిమీబీజముల్
విచ్చిపోవకకూడి వెలసెనేని।
కాఠిన్యమునుజేరి కామినీయుతఁగూడ
కనకకుంభములకు గలిగెనేని।

చలియించిపారని నిలుకడగలకాంతి
చను ఘనాఘనముల కొనరెనేని ॥

అ! వె! యప్పుడించుకైన నగునేమొ యని పాటి।
కానియుప్పు డెల్ల కలుగనేర్చు।
సుదతివదనమునకు రదనములకు నీయు।
రోజములకు నీశిరోజములకు ॥

నేనువచ్చినపని యేమి యిదియేమి. పోయెద (పోయివచ్చి) అక్కటా! ఈతరుణీమణిరూపమునయః కాంతశలాకను నా మనసు సూచిప్రాయమై పాయనేరకున్నది. దీని మందహాసదర్శనమే నాకనంతపదసౌఖ్యము. దీనికటాక్ష ప్రసరణమే నాకమరలోకభోగము. దీని యాశ్లేషసౌఖ్యమే నాకు సర్వలోకాధిపత్యము. ఇట్లుండ నీ సతీమణిని బాసిపోవనేర్తునా? ఈ ఘోరవ్యాళముఁ జూచినంతనే యీ మృగీశాబనయన బెగడొందిపడు మూర్ఛిల్లెను. దీని నుద్బోధింపక పోవుట పాడికాదు. (ఉత్తరయొద్దనువచ్చి) జలజాక్షీ! లెమ్ము భయపడకుము.

ఉత్తర—(లేచి భయమునభినయించి) అహా మేమాయెను?

అభి—సుదతీ! నీవేణీభరమునందలి యీసర్పవేనది నిన్నుఁ జెనకరాఁగదానికి నావలనఁ జావుఁ గలిగె.

ఉత్తర—సాహసదక్షిణ ప్రవర్తకపర భూసురగ్రామణీ. నేనీలోకమున నున్నానా?

అభి—అతివా! నీవు నల్లెయుసిగెదవా—నేనేలోకమున నుండుటయు నేనే యెఱుఁగను.

ఉత్తర—(పాముపైపునఁజూపి, ఆలోక మొకటి దక్క నేలోకము నెఱుగను.

అభి—తరుణీ! నీ యా లోకమొక్కటిఁ గలుగ నాకన్ని లోకములు గలుగును.

ఉత్తర—(స్వగతము) ఇపుడునన్యనైతిని. అయ్యో! నేనేటికిట్లను కొనెదను? నాకెక్కడిధన్యత? (ప్రకాశము,) భూసురగ్రామణీ!

అభి—ఏమియానతిమ్ము.

ఉత్తర—ఏమియు లేదు.

అభి—ఏమియులేకూరక నన్ను బిలిచితివా. నిక్కువముగా నాకేచిత్తచాంచల్యము గలిగియున్నది. నీవు నాయొందనున్నావనియు నీనగుమోము చంద్రునెకసక్కెమాడుచున్నదనియు నింతెఱుఁగుదుఁ గాక వేఱొక్కటి యెఱుఁగను.

ఉత్తర—భూమీసురేశా! నేనేమి చేయుదును.

అభి—సంశయింపక నీమదినినున్న యాశయము విశదపఱుపుము.

ఉత్తర—(ఊరకుండును.)

అభి—నీవు నన్ను మాటలాడించియు మాటలాడకునికికిఁ గారణము సంశయమో—భీతియో—లజ్జయో—నిరాదరణయో—యుండుఁగదా ?

ఉత్తర—నిరాదరణ మెన్నటికిని గాదు.

అభి—అయినఁ లజ్జాభీతిసంశయములా కారణములు. జలజాక్షీ! నీకవియేల, నాయెడ భేద మెంచకుము.

ఉత్తర—భూసురతిలకా! నేనేమియుఁ జెప్పఁజాలను. నాకు మహాదుఃఖముఁ గలిగియున్నది. ఆ దుఃఖము నింతయుఁదాళను.

(అనుబంధము. 27.)

అభి—తరుణీ ! నీకింకెవ్వరిపైనైనను మనసుగలదో ?

ఉత్తర—(తలవంచుకొని) కాదనను.

అభి—ఆమోహనాంగుఁడెవ్వఁడు నాకింతఁ జెప్పుమా ? సర్వాశలు మానెదను !

ఉత్తర—భూదేవగ్రామణీ ! ఏలసూచింపవలయు నాప్రాప్తి యిట్లున్నది. విధికలివలన నాకభిమన్యునిపై మనసు గలిగి యుండెను. నినుఁజూచిన నామది వాసె. మనః కిల్బిషమూలమున నా పాతివ్రత్యమునకు, భంగము గలుగునట్లున్నది. నేనేమి సేయుదును. (దుఃఖించును.)

అభి—అబలా ! నీవు దుఃఖింపకుము. నీవభిమన్యునే పెండ్లియాడునట్లును, నాకోర్కెలు ఫలించునట్లును, నీ పాతివ్రత్యమునకు హానిగలుగనట్లును, నేనొడగూర్పఁజాలుదు.

ఉత్తర—విప్రోత్తమా ! నీమాట యభేద్యార్థముగనున్నది.

అభి—నెలదినములలో దీనియర్థము తేటపడఁగలదు. నీవు విరాటుని పుత్రికవు గావా?

ఉత్తర—ఉత్తరయనుదానను. నీ వెందుండఁగలవు.

అభి—నీవీట నివసించువాఁడ.

[ప్రవేశము-ఉత్తరుఁడు.]

ఉత్తరుడు—ఉత్తరా ! ఇందేలయున్నావు ? పొమ్మింటికి. ఆహా! భూసురా ! నీవేడ రాజేంద్రకొమారియెడ ? అసంబద్ధప్రలాపములా ?

ఉత్తర—అన్నా! ఉత్తరకుమారా ! ఈ బ్రాహ్మణుఁడు నన్నుఁజావువలనఁదప్పించెను.

ఉత్తరుడు—తప్పించెను. తెప్పించెను. నీవవివేకినివి. పొమ్మిక్కడనుండి.

ఉత్తర—అన్నా—

ఉత్తరుఁడు—అన్నా కున్నా-పోయెదవా లేదా ?

ఉత్తర— (నిష్క్రమించును.)

ఉత్తరుఁడు—బ్రాహ్మణా! నీవేదబము లెక్కడనేర్చితివి. రాజపుత్రికిని వెవఁగుబాప నికిని స్వర్గమునకు నరకమునకున్నంత దూరము. నీవు బ్రాహ్మణుఁడవు కాకుండిన, నీవీపు చీలుచుండెను.

అభి—అయ్యా ! మన్నింపుము.

ఉత్తరుఁడు—మన్నింపవలయునా ? నిన్నుఁదన్నింపవలయు. వెడలిపొమ్ము.

అభి—రాజకుమారా ! నేనీవిరాటుని కొలువునందుండ వేఁడివచ్చియున్నాను.

ఉత్తరుఁడు—విరాటుని రాజ్యమున నిన్నుఁడనివ్వను పోకున్న నీచెవులుకోయుంతును.

అభి—అయ్యా—

ఉత్తరుఁడు—అయ్యా కోయ్యా-నీకర్ధచంద్ర ప్రయోగమగును.

అభి—భూమీశా—

ఉత్తరుఁడు—భూమీశా-గోమీశా-తొలగుము. (అనిచెయిపట్టి యీడ్వనభిమన్యుఁడు కదలఁడు) అహా ! నీకింతకావరమా ? ఇప్పుడుచూతువులెమ్ము (మెడబట్టిత్రోయి అభిమన్యుఁడు కదలఁడు)

అభి—(ఉత్తరుని త్రోయును క్రిందపడిలేచి నమస్కరించి చేతులు జోడించి) స్వామీ! నీవు బ్రాహ్మణుఁడవు కావు మహాపురుషుఁడవు.

( అనుబంధము 28 )

నాకరాంగుళిమునలోకమునంతయుఁ గదలింపఁజాలుశక్తి యుంతుండను. నాశక్తి నీయెడనీరసమాయెను. నేనెఱిఁగినంతలో రుద్రుఁడు-కృష్ణుఁడు వేరెయించుక శక్తి కలవారు. వారిశక్తి నాయెదుటఁబనికిరాదు. జరాసంధుఁడు పదునెనిమిది మార్లు కృష్ణుని జయించెను. అతఁడును మామేనమామ కీచకుఁడును సమబలులు. కీచకుఁడు నాకంటె మిక్కిలితక్కువ. (రహస్యమున) ఆకీచకుఁజంపిన వాడనేను. రుద్రుఁడం దమా? యర్జునుఁడే వానిజయించెను. అర్జునుఁడు నన్నేమనుట నాకును నాబరమాత్మ నికే యెఱుక. నీవెవ్వరో యెఱుంగను.

అభి—నేను బడుగుబాపడఁగాని వేఱుకాదు. నీమాటవలన సద్భాతము జనించె. అర్జునుఁడు నిన్నేమనును.

ఉత్తరుఁడు—అతఁడు కాలకేయనివాతకవచులఁ జంపినపుడు సారథియెవ రెఱుంగు దువా ?

అభి—ఇంద్రసారథియగు మాతలి యని విన్నాను.

ఉత్తరుడు — నవ్వి "లోకసుట్టు పెరుమాళ్ళ కొఱుక" రాక్షసులఁజూచి మాతలిపరు గెత్తిపోవ నన్నుఁ బ్రార్థించి యర్జునుఁడు సారథిగాఁ జేసుకొని జయము వడసె. పేరు నకు మాత్రము సారథిగాని నేనే మిగులయుద్ధమాడినది. అప్పుడర్జునుఁడు తనకంటె నెక్కుడయని సఖ్యము చేసినాఁడు.

అభి — (స్వగతము) వీఁడసాధ్యుఁడుగానున్నాఁడు. ఎదురులేకున్నది. ఇంకెంతవఱకు వచ్చునో చూతము (ప్రకాశము) ఇపుడు గదా యర్జునుభంగి తెలిసె. కీచకుని నీవే చంపితివంటివే యెట్లు?

ఉత్తరుఁడు — మాయింటిలో నొక సైరంధ్రియున్నది. దానికి నాకు బరిచయము. దానివాఁడు మోహించి నేను వలదన్నను విననందున రాత్రి సైరంధ్రివేషము వేసి కొని నేనే వానిఁజంపితిని. వానితమ్ముల నట్లే చేసితిని. నీపుణ్యమున నీవెవరి తోడను ననకుము. నాప్రాణమునకు వచ్చును. "వీఁడు కృష్ణునికడ్డము పుట్టినాడు మేనమామను జంపెను" అనియందురు. చూచితివా నీతో మాటలాడచుండఁ జీకటియాయెను. మాతండ్రి నినుకొలువున నిలుపుకొనునట్లు చేసెదను. అతఁడింటే యున్నాఁడు పోవుదమురమ్ము.

అభి — నేను రేఁపు రాజుగారి కొలువునకు వచ్చెదను.

ఉత్తరుఁడు — కొలువేలకావలయు? ఇపుడేరమ్ము.

అభి — క్షమింపుము, ఇపుడు వలదు.

ఉత్తరుఁడు — నేనలసియున్నాను. కొంచెమట్లుపోయి మాసేవకుల వెలతురుదెమ్మనుము.

అభి — నాకాయాసముగానున్నది క్షమింపుము.

ఉత్తరుఁడు — ఇంతమాటవిననివాడవు నీవేమి కొలువుండెదవు. నీవు రాకున్న నిలు చునా-(పోయి వచ్చియున్న పామును ద్రొక్కి) అయ్యో! అయ్యో! చచ్చితి-చచ్చితి (అని క్రిందఁబడును.)

## ( అనుబంధము 29. )

అభి — (వచ్చి) ఏమయినది! ఏమయినది?

ఉత్తరుఁడు — చచ్చితినయ్యా! మాతలితండ్రులతోఁ జెప్పుము.

అభి — నీకేమి ప్రాప్తించినది.

ఉత్తరుఁడు — ఎంత పెద్దపామయ్యా! ఇరువది బారలుండవచ్చును. మృత్యుదేవతవలె కఱచి వెడలిపోయెను.

అభి — అదియా? భయపడకుము. అదిచచ్చినది నీవూరక త్రొక్కినావు ఇదియేకదా? (చూపును)

ఉత్తర—నీపుణ్యమయ్యా! దగ్గఱకుఁ జేకుము.

అర్జు—ఇది చచ్చినదయ్యా.

ఉత్తరుఁడు—నాకుఁ దెలియునయ్యా! నన్నుఁగఱచినప్పుడక్లే త్రొక్కి చంపితిని.

అర్జు—అటుకాదయ్యా! అదిచచ్చినాల్గగడియలయినది.

ఉత్తర—అవునయ్యా!

అర్జు—అయిన నది నిన్నెట్లు కఱచును.

ఉత్తరుఁడు—అయ్యో! చచ్చినపాము కఱవదని యెవరు చెప్పిరయ్యా! శరీరము త్రొక్కినంజాలదా?

[ప్రవేశము: సేవకుఁడు-(దివ్వటీతో.)

సేవ—మాయుత్తర రాజధ్వని విన్నట్టాయెను.

ఉత్తరుడు—అయ్యో! నేనేయప్పా! పాముగఱచి చచ్చియున్నాను.

సేవక—(స్వగతము) చచ్చినవాఁడు మాటలాడుచున్నాడే.

(సేవకార్జునులిద్దఱు నుత్తరుని బిలుచుకొని పోవుదురు—పోవుచు ఉత్తరుఁడు పామునుగొట్టును.)

(సేవక—ఉత్తరుఁడు నిష్క్ర.)

అర్జు—ఆహా! వీఁడెట్టి పిఱికివాఁడు-ఉత్తరాసతీ! ఇట్టినిర్భాగ్యునికి నీవెట్లు చెల్లెలైతివి. పినికొడుకైన నీయందదే మోహము తగ్గునా? రుక్మిఁడును-రుక్మిణియు నొకరికే జనించరా?

( అనుబంధము 30 )

(నిష్క్రమింతురు.)



శ్రీ

# బృహన్నల నాటకము.

## తురీయాఙ్కము.

### చతుర్థరంగము - విరాటునిల్లు.

—( ప్ర॥ కంక - వలల - బృహన్నల. )—

బృహ—అయిననిదియే నిర్ధారణమా ?

కంక—విజయా ! ఇట్లు చేయుచున్న విధిలేదు. నీకొడుకునూఅడించుటకై నీకెంతో యభిలాషయుండును. అయినను సమయముకాదు. ఎంతమనవాడైనను, దానెంత గుఱుతించినను దగదు.

బృహ—అహా ! అగ్రజా ! నేడెట్టిమాటవింటిని. ఇంతటి దుష్కాల మెవ్వరికైన వచ్చెనే ? అయ్యో ! తానైనను గుఱుతించుకోలేకచేవచ్చి నావలె దన కష్టాతిశయంబు గలుగఁ జేసుకొన్న ముద్దుకొడుకును జూచుచుండియు ముద్దాడఁ గౌగలింపఁ దుడకు మాటాడనైనను లేకున్నదే ?

( అనుబంధము 31 )

కంక—నెలదినములలోనున్న దిగదా? ఇంత తొందరయోచింపవలె? విజయా ! నీకుమాత్రమా ధీరశేఖరుఁడగు కుమారునిమాటాడింపఁగూడని దుస్థితిగలుగుట? దానిందలఁచుకొన్న నామానసమెట్లుగలుచుంటయుఁ జెప్పఁజాలను.

వలల—ఓ॥ వేళ నభిమన్యుఁడు ఏకాంతమునఁ బేరునఁబిలిచిన నేమనవలయు.

కంక—ఇంకేమనవలయు ? (దుఃఖమున) నీవెవరనియడుగవలయు.

వలల—అహా ? తండ్రిబిడ్డలకెరవుచేసియున్నదిగదా యీ కష్టవిధి ?

కంక—ఏమిసేయుదము. ఎవరో మాటలాడుచున్న ధ్వనివినవయ్యె. ద్రౌపదికిని— గవలకనునీసంకేతముచెప్పఁడు

(నిష్క్రమించుదురు.)

# బృహన్నలనాటకము.

## తురీయాఙ్కము.

### పంచమరంగము - విరాటునిల్లు.

—॥ ప్ర॥ అభిమన్యుఁడు. ॥—

అభి.— నేనెవరికొఱకు ముఖ్యముగా వచ్చితినో యతఁడే చిక్కఁడయ్యె! కంకభట్టుఁడే ధర్మతనూజుఁడు. వలలుఁడే భీమసేనుఁడు. దామగ్రంథి తంత్రిపాలురే కవలు. సైరంధ్రియే ద్రౌపది. నేను విచారించినవారు వీరితోడ బృహన్నలయు వచ్చెనని చెప్పిరి. ఆ బృహన్నల యర్జునుఁడగునా? ఇదివచ్చిన వేషముకాక, వేసికొన్న వేషము కాదు. ఇదెట్లువచ్చును. అతఁడు ధనంజయుఁడు కాఁజాలఁడు. కానేరఁడు. కాదు. మా పెద్దతండ్రుల నడిగి తెలిసికొందును.

[ ప్ర॥ కంకుఁడు. ]

అభి—పితృవ్యా! నమస్కారములు. (నమస్కరించును)

కంక (— మొగముచిన్నచేసికొని) పితృవ్యుఁడెవ్వఁడు-నీవెవరవు. నీకుఁబిచ్చిపట్టియున్నదో? అవలఁబొమ్ము. (అనిపోవుచు-)ఆహా!) దుఃఖముననిష్క్రి)

[ ప్ర॥ వలల. ]

అభి—పితృవ్యా? నమస్కారము (నమస్కరించును.)

వలల—నీవెవఁడవు అవలఁబొమ్ము (పోవఁబోఁగా)

అభి—(చేపట్టి) దయలేక శ్రీధర్మతనయునొద్ద నామమిక్కిలి చనవు లేమిం జేసి పెద్దపెనఁగఁజాలనైతిని నిను విడువను. మఱేమియు ననను. మా తండ్రి యెవరంత చెప్పఁగా వానుఁజాలును?

వలల—(దుఃఖమున చేయి విడిపించుకొని వెడలిపోవుచు) "హా! శ్రీహరి"

(నిష్క్రమించును.)

అభి—వీరేమి చేయుదురు. వీరి విధి తమకోడదగునట్లు నొదుకని చెప్పకుండఁగూడఁ చేసినదిగా?

( అనుబంధము 32. )

(నిష్క్రి.)

శ్రీ

# బృహన్నల నాటకము.

## తృతీయాంకము.

॥ షష్ఠరంగము - ఉత్తరునిల్లు. ॥

[ ప్రవేశము - ఉత్తరుఁడు - ఉత్తర - నీల. ]

ఉత్తరుఁడు — మా తండ్రికేమిపిచ్చి. ఒకసుశర్మతో యుద్ధమునకుబోవుటకు నాగ్రతమ్ములు తాను చాలక, పంచాంగమువాఁడు — వంటలవాఁడు — గుఱ్ఱాలావులఁగాచువారు, ఇందఱు కావలయునా? నన్నొకనిఁ బంపియుండరాదా?

ఉత్తర — అన్నా! పంచాంగము వాఁడేమి. వంటలవాఁడేమి.

ఉత్తరు — ఉండలేదా మనకంకనభట్టును, వలలుఁడు. వీఁడ్రీనాఁడు పురుషధీరులై నాఁటని

ఉత్తర — అన్నా! వలలుఁడు సామాన్యుఁడు కాఁడు పులులతో సింగములతో —

ఉత్తరుఁడు — నాకేమియు లక్ష్యము లేదు. వానితో మల్లయుద్ధము చేయవలయునని నాకెంతో యభిలాషము. అయిన వంటలవాఁడోటచే.—

( ప్రవేశము - సేవకుఁడు. )

సేవ — రాజేంద్రా! విజయోస్తు. ఉత్తరదిక్కునను మన గోపాలురు మహారోదనము చేయుచువచ్చిరి. కౌరవరాజు బలగమంతయు ధార్తరాష్ట్రి గురుకృపాశ్వత్థామకర్ణులు మన గోధనమున్గ్రహించి తరిమికొని పోవుచున్నాఁడు.

ఉత్తరుఁడు — (కోపమున) ఛీ! ఏమంటివి? మనగోపాలురు వారింపలేకపోయిరా? వారి నీక్షణమునఁ గొలువునుండి తప్పించియున్నానని చెప్పుము. రణభేరి వేయింపుము.

సేవ — భాగ్యము. (నిష్క్రమించును.)

ఉత్తరుఁడు — నీలా! ఉత్తరా! నాప్రతాపము చూపుటకు సమయము దొరకె.

నీల — రాజేంద్రా! నీవొక్కఁడవే — అసహాయుఁడవే. — వారు పెక్కండ్రు — అతిరథ మహారథులే.

ఉత్తరుఁడు — (నవ్వి) ఈతుచ్ఛకౌరవుల కిద్దఱు కావలయునా? మిడుతలగ్నినుబడుట పందెమున వారు సాహసించిరిగదా! నాప్రతాపమార్తాండునకు వారిని మంచుకొండలఁ జేసి బాణానలమున నీఱుగావించెద.

( అనుబంధము 33 )

శరీరమునందంతయు రోమాంచము గలిగించి కాలునిలువనీక నాకోపాగ్ని నన్ను వణఁకించుచున్నది చూచితిరా? సేవకా రథమునిప్పుడే యాయితము సేయింపుము. ఆహా! మఱచితి సారథియెవరు?

నీల — నీకున్న సారథి యేమాయెను?

ఉత్తరుఁడు — నాకు సారథి యెక్కఁడవచ్చెను.? నేను యుద్ధమునకు వెళ్లకలుగనే లేదు. రావణుని మూలబలము పోలె నన్ను మావారొక్కట్టుగా నన్ను పోలికి రానీకున్నారు. అయ్యో! సారథిమాత్రము దొరకదా. —

ఉత్తర — అన్నా! మనబృహన్నలకు సారథ్యమునందుఁ బాండిత్యము గలదనియు, నర్జునుతోఁ జేరి ఖాండవదహనమున గెలుపుఁగలుగఁ జేసెననియు, సైరంధ్రి నాతోఁ జెప్పుచుండెను.

ఉత్తరుఁడు — సైరమపోయి బృహన్నలఁ దోడికొనిరమ్ము.

(ఉత్తర — నిష్క్రమించును.)

ఉత్తరుఁడు — నీలా! నీకు యుద్ధముఁజూచు నభిలాషము కలదా?

నీల — ఉండిన —

ఉత్తరుఁడు — పిలుచుకొని పోయెదను.

నీల — అయ్యో! యుద్ధమే. ఏబాణముతగిలినను బ్రాణాప్రాయమే.

ఉత్తరుఁడు — అందుకే మిమ్ము నబలాజనమనునది. నీకొక బాణము దాఁకనిచ్చిన నేనొక రథుఁడనా? కావలయునన్న నీతోనే యుద్ధమాడించి కురురాజ నరకాసురునికి నినుసత్యభామఁగాఁ జేయుదురమ్మ.

(ప్రవేశము - బృహన్నల - ఉత్తర.)

బృహన్నలా! రమ్ము - నీవు నాకు సారథ్య మొనరింపఁదగియున్నది. కౌరవబిడాలములు యుద్ధమునకు వచ్చినవఁట. ఖాండవదహనమున నీవర్జునునకు సారథ్యమొనరించి

తివంటి నాకును నర్జునునకును గల తారతమ్యము నీవేయెఱుఁగుదువు. మద్బాణాగ్నిచే సేనకౌరవఖాండవము దహించి విజయత్వము పొందఁదగియున్నది.

బృహ—యువరాజా! సేనంతకుఁజాలుదువా!

పృథ్వీవృత్తము॥ మహాబలగరిష్ఠు లామగలు కౌరవుల్వెంచియుర్ ।
సహాయబలగర్వితు ల్సరకు సేయరారుద్రునిన్ ।
అహీనగతి వారి నేఁడని వధింపఁనీవేగఁగా ।
సహా తెలిసి యెట్లు లేనగుదు సారథిన్ భూవరా॥

మహాబలిష్ఠులగు కౌరవులయుద్ధమున నేను సారథిఁగాఁదగుదునా?

ఉత్తరుఁడు—నీవు భయపడకుము. ఉత్తరరాజ కేసరికిశోరప్రవీణత కౌరవ కరియూథములపై వెలయించునప్పుడు గదా, నీవెఱుంగఁగలవు? కవచము వేసికొనుము.

బృహ—(వేసికొనలేఁడు)

ఉత్తరుఁ—(నవ్వి) మంచి సారథివి (కవచము వేసి) నీవూరక పేరునకు మాత్రముండుము. నే రథినై, సారథినయ్యెద.

ఉత్తర—అన్నా! నీవు కౌరవవీరుల జయింతువుగదా? నాబొమ్మ పొత్తికలకుఁగొన్ని యంబరములు దెత్తువా?

(అనుబంధము. 34.)

ఉత్తరుఁడు—చెలియలా! కావలసినన్ని తెత్తును. నీవుపోదు వచ్చినదమ్మా.

ఉత్తర—నేను రాఁజాలను.

ఉత్తరుఁడు—నీకు భాగ్యములేదు. ఏరికిని స్త్రీలు యుద్ధమున్న నిట్లు భయపడెదరు.

ఉత్తర—బృహన్నలా! నీవు మాయన్నకు జ్ఞాపకము చేయుదువా?

బృహ—కుమారీ! ఏలయోచించెదవు. అవశ్యము చేయుదును.

ఉత్తరుఁడు—బృహన్నలా! ఈయాఁడువాండ్ర మాటలు వినుచున్న మనపని యెట్లు జరుగఁగలదు. అయినను నేననికిపత్తునను వార్త తెలిసిన వెంటనే, కౌరవులు పలాయితులై పోవుదురు-పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

—( తురీయాఙ్కము సమాప్తము. )—

శ్రీ

# బృహన్నల నాటకము.

## శశ్చమాజ్యము-ప్రథమరంగము (అడవి)

[ ప్రవేశము - అభిమన్యుఁడు. ]

( అనుబంధము 35 )

అభి.—అహా! ఏమి చోద్యము-బృహన్నల సాహాయ్యమున నుత్తరుఁడు కౌరవులపై వెడలెడునఁట. నాకోరిక ఫలించునట్లున్నది. ఇదివఱకే బృహన్నలను, నేను చూచునప్పుడంతయు నతఁడు నామోము దేఱచూడనిచ్ఛయించ కుండుటవలన, నాకు సందేహము కలిగె. నేఁటియుద్ధము నిజమాయెనా బృహన్నలయే మాతఁడ్రియగు. నే మఱుగుననుండి యరయుచుందను.

(మఱుఁగున నిష్క్ర.)

[ ప్ర॥ రథముపై ఉత్తరుఁడు-అర్జునుఁడు ]

ఉత్తర—బృహన్నలా! రథమింతనిలుపుము మనమూరు విడిచి యెంతదూరము వచ్చియున్నాము?

బృహ—ఏదీ పాదక్రోశమయినను రాలేదే. ఇదియేయూరు.

ఉత్తర—అక్కడకనుపించు తోఁటలోఁబోయియుందము.

బృహ—ఉండి?

ఉత్తర—తోఁపుయుద్ధమాడుదము.

బృహ—గోధనము మనకుఁజిక్కెనా?

ఉత్తర—చిక్కకున్న నూరుచేరుదము.

బృహ—ఇక్కడికి వచ్చిన పనియేమి?

ఉత్తర—నీకీయధికప్రసంగ మెందులకు?

బృహ—నీకేమి భీతిగలిగెనా?

ఉత్తర — భీతి ? ఈక్షత్రియపుత్రులకు భీతి కావలయునా ! వానిలో మగవాఁడెవ్వఁడు చెప్పుము.

బృహ — కూయఁడన్న నీవుగదా?

ఉత్తర — అందుకుఁ గాదు. నాకేమోయపశకునములవుచున్నవి.

బృహ — అపశకునము లెక్కడివి? ఇంతటి సత్పురుషునకు లెన్నఁడైన నాయునే.

ఉత్తర — నావామనేత్ర మదిరినది చూచితివా? నావామభుజ చలించినది చూచితివా ?

బృహ — భయము గలిగిన నది చలించును.

ఉత్తర — ఇంకొకసారి భయమన్న నీయొడలు నీది కాదు. పోనిమ్ము రథము.

బృహ — భాగ్యము.

ఉత్తర — (కొంతదూరము పోయి) బృహన్నలా ! దాహమగుచున్నది. దాఁటివచ్చిన బావికిఁబోదము.

బృహ — రాజేంద్రా! ఎంతయుద్ధమూఁదగియున్నది ! ఇప్పుడే యిట్లు నోరెండిన నెట్లు. ఊరకపోవము.

ఉత్తర — (కొంతదూరముపోయి) బృహన్నలా !

బృహ — రాజకుమారా ! ఏమి.

ఉత్తర — (యోచించి) అదియేమిటిది?

బృహ — మఱ్ఱిచెట్టుగదా ?

ఉత్తర — మఱ్ఱిచెట్టు—యెట్లున్నది చూడు.

బృహ — ఊరక మాటలాడిన జాగగును. పోవుదము.

ఉత్తర — (కొంతదూరముపోయి) బృహన్నలా !

బృహ — ఏమి? (అని కసురును.)

ఉత్తర — అట్లేలదలించెదవు? అది యేమి ?

బృహ — ఆవియా — అవిసెకూరఁ.

ఉత్తర — (స్వగతము) నాకు వీఁడేడ బాపురిమాలెను? (కొంతదూరము పోయి) బృహన్నలా !

బృహ — ఏమి? (కసరును.)

ఉత్తర — అయ్యో ! నినుఁబిలిచితినా ?

బృహ — పిలువకున్నఁ బోనిమ్ము.

ఉత్తర — (కొంతదూరముపోయి) బృహన్నలా ! బృహన్నలా ! బృహన్నలా! బృహన్నలా ! బృహన్నలా! బృహన్నలా ! (వింటికొపునఁబొడిచి) బృహన్నలా! అది యేమి. నేల యీగనరీతిగా మనుష్యుల పుట్టి పగిలియున్నదే ?

బృహ— ధరణీశకుమారా ! అదియే కౌరవసైన్యము.

ఉత్తరు— కౌరవసైన్యమా ! ఏమి రథములు. ఏమిధ్వజములు. ఏమిగుఱ్ఱములు. ఏమి పతాకములు. ఏమి ధనువులు. ఏమిరథికులు. నాచేఁతఁగాదు. మనమూరకపోదము.

బృహ— రాజకుమారా ! బాణప్రయోగములు తదుపసంహారములు ధనుష్టంకృతులు యేవియువినకనే భీతిల్లెదవా?

(లోపల సైనికుల కలకలము.)

ఉత్తరు— అయ్యో అయ్యో ! నేఁజాలను జాలను— ఊరకూరుచేర్పుము.

బృహ— ఉత్తరకుమారా! యువతీజనముననుండి కౌరవులనుక్కడించి గోవులఁదెత్తు నంటివి. చెలియలికి బొమ్మపొత్తిక లిత్తునంటివి.

ఉత్తరు— కౌరవులు సౌఖ్యమున నూరుచేరని. గోవులుపోయినఁ బ్రోవఁబోనీ. చెలియ లేడ్వఁబడనీ. బొమ్మపొత్తికలుమండనీ. ఒల్లనొల్లను. అయ్యో! బృహన్నలా! మాటలాడుచుండఁగనే రథము నడపుచున్నావే.

( అనుబంధము 36. )

బృహ— రాజపుత్రా! వెనుకకుఁబోవ నాచేతఁగాదు. నన్ను సారథిగ నేలగైకొంటివి ?

ఉత్తరు— బుద్ధి నేరక చేసితినప్పా-తప్పైనదప్పా-నన్నుఁ బురికిపడిచి నీయిష్టమువచ్చినంత యుద్ధమాడుము.

బృహ— కుమారా! ఇది క్షత్రధర్మమా! మీఱితియుద్ధమునఁ జచ్చినను వీరస్వర్గము గాదా.

చ॥ శరనిచయంబులన్ రిపుల సారము శాపి జయింప కీర్తి సం।
గరమున కోహటించి వెనుకన్ బడి పాఱెడు భీరుభంగి దు॥
స్తర మిటు లాచరించినను క్షత్రియధర్మనె కీర్తి దక్కనే ।
మరణము నొందనేమి వినుమా సమకూఱెడు నాకభోగముల్॥

ఉత్తరు— చచ్చినమా ! అక్కొలందువు-నాప్రాణములు నాకేమి భారములా ? బృహన్నలా! ఏమిట్లు పోనిచ్చెదవు. అయ్యో! అయ్యో! (అని రథము వెనుకనుండి దమికి ముందఁ ఉఱికివచ్చి.)

(అనుబంధము 37 )

బృహ— (వెనుకఁ దిరిగిచూచి వెంటఁబరుగెత్తును, మూఁడుమారులు రంగమున నిటు పరుగెత్తుదురు.)

[ప్ర॥ బృహన్నల-ఉత్తరునిఁ బట్టుకొనును.]

ఉత్తరు — అమ్మో! బృహన్నలా! నమస్కరింతును. నీకుఁబది గ్రామములు, వెయ్యావులు, ఏనూఱుగుఱ్ఱములు, నూఱేనుఁగులు బహుమతి యిప్పింతును. ప్రాణములమోసుకొని వచ్చినఁ గౌఁగిలించి యాదరింపనున్న, మాతలితండ్రులకు నాభార్యకు నాశాభంగము చేయకుమా?

( అనుబంధము 38 )

మృత్యువు పేరంటముపిలిచినట్లు నిన్నేలపిలిచితి. నాకు జీవదానమిమ్మా? ఇంటనైనఁ బ్రాణములు విడిచెదఁగాక, యుద్ధమున విడవఁజాలను.

బృహ — రాజకుమారా!

సీ॥ కాలానుచరరీతి వేలార్పుభటులబల్
కోలాహలములకు డీలుపడక।
శంకారహితవీరహుంకార బహుధను
ష్టంకారములవంక జంకుగనక।
కదనామితబలసంపదనారఁ గాంచిన
మదనాగసమితికిఁ గదలఁబడక।
భుజసారనిహితసామజసామ్యమునఁ బొంగి
నిజనాయకము లేయునియతి విడక॥

తే॥ గీ॥ భూరిసంగ్రామసీమ దుర్వారవైరి।
వీరవిదళన మొనరింప నేరకున్నఁ।
గీర్తిగల్గునె యేలయీ యార్తి నీకు।
నేను నీదండనుండ నీకేమి భయము॥

నేనుండఁగా నీకేమిభయము-క్షణమునఁ గౌరవసేన నఱుమాడుదమ్మా.

ఉత్తర — పొమ్మా-నేను వలదనను.

( అనుబంధము 39. )

కొంచెము విడువుము రహస్యమునకుఁ బోవలయు.

బృహ — నాకు సారథి కావలదా?

ఉత్తరు — నీవే సారథి — నీవే రథివి. నీవే భూతమవు - నీవే దయ్యమవు. అన్నియు నీవే యైయుండ నింటికిఁ బోవరాదా? తోడుకలేక చావననుచున్నావే.

బృహ — కుమారా! నీవేమన్నను విడువను.

ఉత్తరు — గ్రహచారమా! నే నేపాపిముఖము చూచితిని. భూదేవీ! పర్వత సముద్రాదుల మోయుకొనియున్న నీకు నేనొక్కఁడను భారమా! జనకా! విరాట! తల్లీ సుధేష్ణాదేవీ! నేను మిమ్మెట్లు చూతును.

( అనుబంధము 40 )

బృహ — ఏమీపనిచేత వైరాటీ!

ఉత్తరు — అయ్యో! నీసారథ్యము వారథిపాలుగానీ! నీపూరత్వము మండిపోవనీ - ఏ విధమున నీవు కొడుకవై జన్మించితివో? అయ్యో! అమ్మా! (ఏడ్చును)

బృహ — ఉత్తరా!

ఉత్తరు — అయ్యో! రాజేంద్రా యంటివి. రాజకుమారా యంటివి. యువరాజా యంటివి - వైరాటీ యంటివి. ఇపుడు ఉత్తరా యంటివి. ఏమైనను. విరాటపుత్రాధమా యనుము. నోటికివచ్చినట్లు తిట్టుము. ఇష్టమువచ్చినంత కొట్టుము. నన్ను మాత్రము విడిచిపెట్టుమా?

బృహ — నీతో నింక మంచిమాటలు పనికిరావు.

కం॥ విడ నిన్ను నెక్కుడు మారదము ।
తడసిన నీకు నీమ్పువాఁడె దాక్షిణ్యము లే ।
డోడలోపమి సిడిగిలం ।
బడు క్రోవ్విన మాయము మంచిమాటలవినునే ॥

(ఈడ్చుకొనిపోయి నొగలపైఁ బెట్టును.) అశమీవృక్షమున్న యెడకు రథము తోలును.

ఉత్తరు — (ఏడ్చుచుండును.)

( నిష్క్రమింతురు. )

(పునః ప్రవేశము - ఉత్తరుఁడు - బృహన్నల.)

ఉత్తరు — అయ్యా! ఈపీనుఁగు నెట్లు తాఁకుదును?

బృహ — జనములు ముట్టకుండుటకై శవాకారముగాఁ గట్టిన శస్త్రాస్త్ర సందోహము కాని, యితరము కాదు. శవమైన నిన్నీపనికిఁ బెట్టుదునా?

ఉత్తరు—(వృక్షము నెక్కి) సారథీ! ఘోరసర్పములే! పెను మంటలే! ఒకక్షణమున కత్తితోఁ జేయుపని కింతదూరము పిలుచుకొని రావలయునా?

బృహ—కుమారా! భయపడకుము. శ్లో॥ "అర్జునః ఫల్గునః పార్థః కిరీటి శ్వేతవాహనః బీభత్సుర్విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః", అను నీమంత్రము మూఁడుమార్లు పఠించి యక్కడనున్న ధనువుం దీసుకొనిరమ్ము.

ఉత్తరు—(తెచ్చి) నీచరిత్రము చోద్యముగానున్నది. అర్జును పేరు చెప్పినంతనె, యివి సౌమ్యాకారము ధరింపఁగారణమేమి? ఇవి యెవరివి?

బృహ—కుమారా! ఇదియర్జును గాండీవము, నల్లనిదియై బంగారుబొద్దులు చెక్కిన చాపము యుధిష్ఠిరునిది. తాటిచెట్టువలె నున్నతమై, బంగారు శాఖలు చెక్కిన బాణాసనము భీమునిది. రక్తవర్ణముకలిగి బంగారు చేఁపలుచెక్కిన కార్ముకము నకులునిది. నిగనిగ మెఱయుచు-బంగారు నెమళ్ళుతీర్చిన ధనువు సహదేవునిది.

ఉత్తరు—ఇదేమిటిది పర్వతము?

బృహ—భీముని గదాదండము.

ఉత్తరు—ఇవియన్నియు నీకెట్లు తెలిసెను?

బృహ—నేను తెలియఁదగినవాఁడఁగనుక తెలిసితిని.

ఉత్తరు—ఆ పాండవులెందున్నారు?

బృహ—మన కీటనేయున్నారు.

ఉత్తరు—మనకీటనా? ఎవరువారు.

బృహ—రాజకుమారా!

కం॥ మాలిని ద్రౌపది కంకుం ।
డాలలి ధర్మజుఁడు వలలుఁడగుభీముఁడు గో ।
పాలుఁడు సహదేవుఁడు హయ ।
పాలుఁడు నకులుండు మనుజపాలకతనయా ॥

కంకుఁడే ధర్మరాజు-వలలుఁడే భీముఁడు. దామగ్రంధి తంత్రీ[illegible]లు రేకవలు. సైరంధ్రియే ద్రౌపది దానికై కాదె గంధర్వనామమున భీముఁడు కీచకులం జంపెను.

ఉత్తరు—భీముఁడెవరు?

బృహ — వలలుఁడే భీముఁడంటివే.

ఉత్తరు — వలలుఁడగ్నుఁడంటివి—నీవు మఱచినావు—జ్ఞాపకము చేసికొనుము.

బృహ — కాదు వాఁడు భీముఁడు.

ఉత్తరు — ఇంక నర్జునుఁడెవరు?

బృహ — చూపెద నిటు రమ్ము. (కొంతదూరము పోయి.)

( అనుబంధము 41 )

[బృహన్నలకు రూపము మాఱి క్రమముగఁ గిరీటము-శంఖము-కవచము-కేతనము గల్గును.]

(ప్రవేశము-అభిమన్యుఁడు (శీఘ్రముగ.)

అభి — (బృహన్నలను కౌఁగిలించి.)

( అనుబంధము 42 )

అర్జు — తనయా! అభిమన్యుకుమారా! నెలదినములనుండి యీవీటనున్నను, నీతో మాటలాడకుండ నిన్నాశ్లేషింపకుండఁ జేసెఁగా నావిధి.

(అనుబంధము. 43 )

అభి — తండ్రీ! నీ వేమి చేయుదువు? నీయజ్ఞాతవిధి తీఱినవెంటనే నిన్నాశ్లేషింప నెంచిన నాకు నేఁడా శాపవిముక్తియునదే పదివేలు. నా పెద్దతండ్రులు పినతండ్రులు మాఱువేసముల ధరించిరిగాక, వారిఁ జూడ్పనలేక నీకే తెలుఁగగట్లు వారెట్లో.

అర్జు — కుమారా! ఇది యూర్వశీశాపమున నింద్రుని సహాయముఁ గలిగిన వేషము. నీతో మాటలాడు వేళ గాదు. వైరవర్గము మఱిమించి పడినాక్రమించె. కదనమునఁ బ్రవర్తింపవలయు.

అభి — నేను బాణాసనము సిద్ధపఱచియున్నాను. నీకు శ్రమయేల? నేను పోయివచ్చెదను.

అర్జు — కుమారా! నీవంతకుఁ జాలుదువు.

[ప్రవేశము-సేవకుఁడు వేగముగ.]

సేవక — ఉత్తర రాజేంద్రా? కౌరవసైన్యము రథికులతో నేతెంచి పట్టణమునంతయుఁ గలగుండు పెట్టుచున్నది.

కర్ణ—ద్రోణాచార్య! నీకుఁ బాండవపక్షపాతము వదలదు. వాఁడర్జునుఁడైన నంతియే చాలును. వానినుక్కడించి వానితండ్రినిఁ జూడఁబంపెదను.

దుర్యో—కర్ణా! నీమాట లరుచికరములు. వాఁడర్జునుండాయెనా మరలఁ బన్నెండేండ్లరణ్యవాసమునకుఁ బంపెదను. ఇతరుఁడాయెనా మద్బాణపరంపరలఁ జూర్ణము చేసెదను.

ద్రోణ—అహా! కనులకు మిఱుమిట్లు గొలుపు నిలుకడఁ గాంచిన మించుఁబోలె వెలయుఁగా యీకిరీటకాంతి? రోదసీతలమంతయుఁ బటాపంచలగునట్లుచేసి కర్ణకుహరములఁ బగుల్చెఁగా నీశంఖరవము? తేఱిచూడరాకుండ వేషినైనమించి కపిరూపమూనిన చండభానునిఁబోలె వెలసెఁగా యీకేతనవైభవము? కల్పాంతదీర్ఘనిర్ఘాతారావముపోలె వెలసెఁగా యీ ధనుష్టంకృతి? ధరాతలమున కేతెంచిన నానటన్మహానటునిఁబోలెఁ జూడ్కికి వ్రేఁగైతోఁచెఁగా యీపురుషుని విభ్రమము? అదియే వాసవుఁడిచ్చిన మకుటము? అయ్యదియే కపికేతనము? అయ్యదియే దేవదత్తము? అల్లదియే గాండీవము? వాఁడే సమరాభీలవిరోధిశిరఃప్రహారకుఁడైన కదనమృత్యుంజయుండు. వైరిసేనామహాటవీధనంజయుండు ధనంజయుఁడు. ఈవీరవరునితోఁ గారణము లేని కలహమేల?

దుర్యో—ద్రోణాచార్య! మనము వచ్చినపనియేమి యిప్పుడాడు మాటలేమి? పాండవులు గుఱుతింపఁగిదా సుశర్మనయ్యెడకుఁబంపి మనమిందువచ్చుట? సమరమున కోహటించి మన మీవెఱమాటలతోఁ గాలయాపనము సేయనేల? యుద్ధమునకు నిలిచెనా వాఁడర్జునుఁడగుఁగాక నేను వానికి దహనుఁడనయ్యెదను. అయ్యో! చిన్నవారు నవ్వుదురని యించుకైన గణింపక యీ ద్రోణాచార్యుఁడు నాయెదుటఁ దుష్టవైరిం గొండఁజేసి ప్రశంసింపవచ్చునె? నాకు సిగ్గగద.

అశ్వ—దుర్యోధనా! నీవు శూరాగ్రేసరుఁడవు. నీవనిన్నుఁ బ్రశంసచేసికొనఁదగుదువు. ఈ ద్రోణాచార్యుఁడు కడుముదుసలిఁడు. నిన్నెఱిఁగినవాఁడు కాఁడు. కావున నిట్లాడెను. నీవో యసహాయుఁడవై భీమయుద్ధమునఁ బాండవుల జయించి వారిని నిల్వకుండఁ జేసినందున, వారడవులనుఁ బోయిరి నిద్రవేఁటునకుఁ దాళలేకయే భీముఁడేటం బడిపోవ నుద్యోగించెను. విషాన్నము దినినైనఁ జావనుద్యమించెను. నీవు కరుణామతివై వారి రక్షించితివి. పాండవులు నీనామమునుగలయందును గలువరించెదరు. అతిభీతులై ప్రాణములనైనఁ బాయుదుమని యొకలక్కయిల్లు నిర్మించుకొని యందుల కగ్నిఁబెట్టించుకొనిరి. నీవేకదా, దయామహిమంబున వారిఁ బ్రోచితివి. నీవు ఘోషయాత్రకుఁబోయినపుడీ యర్జునుడు చిత్రసేన గంధర్వునిచేఁబట్టువడి, స్వర్గ్యాహికాశలు మానియుండెను. కృపాపరుఁడవై తప్పించితివి. నీ దాక్షిణ్యమును, నీనిర్లోభత్వమును నీ పరోపకారపరత్వమును నీ కరుణానిధియుఁ గలిదాఁజైన నుతింపజాలఁడు. నీకంటెఁ బ్రశంసనీయుఁడు నీవును శకుని.

మీరిద్దఱు దేనిసాధింపఁజాలరు? మహాశక్తిసమేతులైన యీ పదుగురు గోరక్షకులను నేఁడే ఘోర యుద్ధమున జయించినని కాయర్జునుఁ డొకలెక్కయా? పాఁడేమి గాండీవమున బాణము వేయునా! మహాస్త్రము వేయునా? దుగఁదచ్చినబారలు పాచికలతో వేయును.

కర్ణ—ద్రోణపుత్రా! రాజరాజా నీమాటలా నీ వాడవలయు? రాజేంద్రా! యుద్ధమునకు వచ్చుచు నీవీబాపలనేల తోడ్తెచ్చితివి? భోజనాదుల వర్ణనము సలుపువారు గాక యుద్ధమాడువారే? ఆర్యులారా! బ్రాహ్మణోత్తములారా! మీకు నమస్కృతులు. మీ రేమియు యుద్ధమాడవలదు. ధనువుపట్టవలదు. మమ్మెంతగ నాడకుండినదే పదివేలు. సౌఖ్యముగఁబోయి భుజింపుఁడు మమ్మాశీర్వదింపుఁడు.

అశ్వ—కానీనా! నిను నేఁడు క్రొత్తగాఁ జూచెదమా? బాపలను మమ్మ నేలతోడ్తెచ్చెనా? భీమాశనులఁబోలిన యర్జునబాణ పరంపరలు నీయెదఁగాఁడి మృత్యువునకు నిన్నర్పించుచో నీవుఁ బ్రేతత్వప్రత్యక్షమై తిలోదకము లిప్పింప మేము కావలనో? మాకస్త్రనైపుణి యెక్కడిది! నీవైనఁ జిత్రసేనునోర్చి చెఱఁబడియున్న మమ్మును దుర్యోధనుని విడిపించితివి. మత్స్యయంత్రము నవలీలఁదెగవేసితివి. క్రూరకర్ణా! సిగ్గులేక శూరుఁడనని ప్రశంసించుకొందువా? ఆద్రోపది స్వయంవరకాలమున నీవు వచ్చియుండలేదే? పంచప్రాణము లుండెనె! చతుఃప్రాణములిదే యర్జునబాణావళి యాకర్షించెనే? అప్పుడైన నెఱుఁగనైతివా? నిన్నాశీర్వదింపవలయుఁగా? పిడుఁగుఁబోలిన యర్జునబాణములచేఁజావక యుండుమా! ఇదే పూర్ణాశీర్వాదము.

కృప—అశ్వత్థామా! నీవు బ్రాహ్మణుఁడవని యెఱింగించుక యోర్చుకొనఁ దగియున్నది. అయినను పరిమితి మీఱిన నీచభాషణములనెల్ల నాకుమారుఁ డుపేక్ష చేయునని నమ్మెదను. ఆచిత్రసేనుఁడు శూరుఁడే? అందున గంధర్వుఁడు. వాని నెవరు జయింపఁగలరు. అర్జునుఁడు మాత్రము జయించెనా? అతఁడు వాని సఖుఁడైనందున యుద్ధమాడిన శాస్త్రము చేసి మానెఁ గాక. అయిన నీవేమి పెద్ద చేసితివి. ఇంక నాపలుకు స్వయంవరకాలమునందలి కలహమున నన్నొకసతికై యూరకవైరమేల పెంచవలయునని మానితిఁ గాక సాధింపఁజాలకుంటినా? నన్నూరక యేల దూషించెదవు.

అశ్వ—ఓరీ! సూతపుత్రా! చిత్రసేనుఁ డర్జునుని సఖుఁడుగా? వాఁడు యుద్ధమాడినరీతి చూచుచున్నను వినవో? ఏల ప్రల్లదము లాడెదవు? ఒక సతికై యింతేలయని స్వయంవరకాలమున నర్జును బోనిచ్చితివిగా? ఆసతికైయే కదా నీవంత దూఁగను పోయినది. దానికై కదా మత్స్యయంత్రము దెగవేయఁ జూచి రిత్తవడి హాసింపఁ బడితివి. దానికై కదా, యర్జునునితో యుద్ధమాడి ప్రాణావశిష్టుఁ డవైనది. ఏల యనృత మాడెదవు? నీ నోరుపుళియును నీ నాలుక పుచ్చిపోవును.

శా॥ ఓరీ సూత సుతాధమా తెలియలేవో పాపసంభాషణం।
బేరంజించునొ యేటిజిహ్వ యది నో రేనోరు పాంచాలికై।
పోఁ కేయుందలఁ పార్థబాణతతి నిష్పల్ గాల్పఁగాఁ గ్రమ్మఱన్।
రాఁ కేతాళఁగలేక యీపలుకులా నే కర్ణ యిట్లాడుదే॥

కర్ణ శా॥ భూపా నాకిపుడానతీయవలయు నీపుణ్యేతరున్ దుర్మ్రహా।
లాపున్ జీలుచుని గాలుపట్టి వడి నేలం గొట్టెదన్ బిట్టుగా।
వాపోవన్ (అశ్వత్థామతో) పలుగాకి బాపఁడవు నుర్వాదంబు లిట్లాడెదే
ఈపల్కుం గొకసారి యాడినను నీ వెందుండురా దుర్మతీ॥

దుర్యోధనుఁడు—

ఉ॥ తాళుఁడు తాళుఁడయ్య యనుతాపముఁ బొందఁగఁ బాడియయ్య పై।
నాలము సేయవచ్చు నభియాతిని జంపుటమాని క్రోధక।
ల్లోలమనస్కు లౌచు మనలో మనమే జగడంబు సేయఁగా।
బాలిశులంచు మమ్ముఁ గనువారలు చుల్కన సేయకుందురే॥

ఇది మీకలహమునకుఁ గాలమా? శాత్రవుఁ గెలుపు నుత్సాహమున నేను నేని వేడలు సంతోషమునకుఁ గాలము కాక. కర్ణా! ఒప్పుకొనుము. ద్రోణసుతా! ఊరడిల్లుము.

కర్ణ— ఈ బాడబుల యుపాలంభోక్తుల విని సైరించుట దుస్తరము. అర్జునుఁడను నే-ర్పరి బెగడువడి పడఁకుచుఁ బ్రశంసించుచు. వాఁడొక్కఁడే పీనుదేకదా? ఒకనికొకఁడే చాలును. నేనే చాలెదను. అర్జును జంపుకుతూహలముఁ నాకు మొదుగనున్న నేఁడు కాలము సమకూరినది. మీరందఱును సెలవిమ్ము.

కృప— కర్ణా! నీకేల కలిగె నింత బేలతనము? ఎఱిఁగి యెఱిఁగి మెఱయుదన మేల? స్వయంవరము నాఁటి యర్జును నే యెఱుఁగుదువు గదా! ఇప్పుడా యర్జునుఁడు కాఁడు సుమా! శివునితోఁ బోరాడి పాశుపతముఁ బడసినాఁడు. ఇంద్రుని మెప్పించి యర్ధాసనమున నుండినాఁడు. దివ్యకిరీటశంఖములఁ బొందినాఁడు. కాలకేయనివాతకవచుల నొక్కఁడే పోరి వధించినాఁడు. నీవు శూరుఁడవే? మహారథుఁడవే? వలయున్న సముద్రము నీఁది రాఁగలవు? ఒప్పుకొందును. దావాగ్నిఁ బట్టఁగలవు. ఇయ్యకొందును. జగమునంతయు నెత్తుకొని పోఁగలవు సమ్మతింతును. మృత్యువుతోఁ బోరాడఁగలవు. ఇత్తును, కాని యర్జునుతో నొంటి పోరుదువన్న నొడంబడను సుమా? అది దుస్సాధ్యమైనదగా దసాధ్యము. వానితో నొంటిమారొకన ముక్కంటికైనఁ జాలఁడు? నీబంటుతనము కంటువడును. అనియేల, మన మెల్లరము కలసి యనినేయుదము.

కర్ణ—కృపాచార్యా! కానిమ్ము. తినఁగల వాఁడితిని ధ్వంసము చేసితిరి. యుద్ధమన్నఁ జచ్చితిమందురు. మీసహాయమేమియువలదు. శ్రాద్ధమే మీయుద్ధము! హోమ గుండమే మీరణరంగము! సమిధలే మీశరాసనములు! దర్భలే మీబాణములు! ప్రాణాహుతులతోడనే కడుపునిండింపుఁడన్న సిద్ధము. మీకేల యుద్ధము. శత్రు వందవలెనఁ బొగడువారెంత పోరఁగలరు?

అశ్వ—ఇది నీతప్పితము కాదయ్యా! నీతిరిపెఁపుతిండి తప్పితము. పిడికెడుకూడు నర్లనఁ దిని బ్రదుకు శ్వానము మెట్టివారికైనను బోవును. అయినను దానికొక్క సుగుణము గలదు. తనపతికి మేలు గోరువారిఁ జెనకదు.

కర్ణ—రాజేశ్వరా! నాకిప్పుడే యానతియ్యవలయు. ఈ యత్యల్పుని ఘోరపాపుని నాలుకఁగోయుదును.

అశ్వ—ఓరీ! యర్జును బాణములఁజచ్చు పుణ్యము లేదు కాఁబోలు. నాపాదరక్షచే నీ శిరమును గాకిఘూకములకు విందొనర్చెద.

కర్ణ—మదాంధా! చచ్చితివి.

అశ్వ—పలుగాకీ! నీల్గితివి.

దుర్యో—విప్రవతంసములారా! నమస్కరించి వేఁడుకొందును. క్షమింపుఁడు. అంగ రాజా! ఇది సమయముకాదు. మానుము.

భీష్మ—సుయోధనా! ధర్మభంగి ద్రోణాచార్యుఁడాడె. ప్రతిష్ఠాధిష్ఠితుండైన పుత్రుఁ బోలినస్వప్రియశిష్యుం బ్రశంసించుట నేరమా. ధీరగుణము కలవాఁడు వైరికైనను బ్రశంసింప దగినవాఁడు. ఈయశ్వత్థామ సమయోచితాలాపము లాడె. ఇంగిత మెఱిగినవాఁడు గదా కృపాచార్యుఁడు. శాస్త్రార్థరాజనీతి యుక్తవచన భంగి నుగ్గడించెను పొగడదగినవాడు. ఎట్లును ఆచార్యులగువారు త్యాజ్యులు. అట్టిచో నేకారణము లేక దేశకాల విచారమింతైనఁ జింతింపక, వివేకమించుకైన గణింపక, నీచజాతియోగ్యపరుషభాషణముల నీకర్ణుఁడాడెను. సజ్జన దూషణమును నాత్మ గర్హణమును, నాత్మప్రశంసయు, ననునీదుష్టస్వభావంబులు వీనికి వెన్నతోడఁ బెట్టినవిమైయుండఁ గయ్యమునకెపుడు కాలుద్రవ్వుచుండును. వీనిమాటలు పాటిం చిన వారికిఁ గీర్తిసుఖములు గలుగవు.

దుర్యో—మీరూరక వాఁడెక్కుడు వీఁడెక్కుడని వాదులాడెదరు. ఏయుద్ధముకు లేక మంచిమాటల పునర్ద్వాదశవర్షారణ్య వాసమునకుఁ బాండవులఁబంప మార్గముండ మీవాగ్వాదమేల.

అశ్వ—సుయోధనా! నీవు మోహమునఁగన్నుఁగానకున్నంతనే పదమూఁడేఁడులు రాజ్య బాహిరులై గణింపరాని పాటలఁబడి దినమొక యేఁడుగాఁ గాంచుచున్న పాండవులు నీవలె నవివేకులగుదురా? సమయము నెఱుఁగక వారేల వెలువడియెదరు.

దుర్యో — పరుషభాషణము నీజన్యము. ఊరకుందుము. భీష్మాచార్యా! ఈకాల నిర్ణయము నీవొనర్పవలయును.

భీష్మ — నేనపుడే గణించియున్నాను. నిన్ననష్టమితోడనే వారియజ్ఞాతవత్సరము కడతేఱెను. అకటా! ధర్మదేవత యాకృతిఁగాంచి నిలిచినట్లు లీధరాతలమున వెలుఁగొందుధర్మనందను పోష్యమునను న్న వారు సమయభంగ మొనర్తురే! సుయోధనా! వారితో మన మేల యింక సంధి కార్యము నడుపరాదు.

దుర్యో — ఆమాట లిపుడుండనీ. మనకార్యము చూచికొందము. పోవుదము.

ద్రోణ — ఆహా! ఏమి యీ గాండీవకోదండపాండిత్యము. నా పాదములయొందుఁ బడి నమస్కరణ సూచకములగు రెండమ్ములను చెవులు సోఁకియుసోకని ధంగిఁ జరనియోగ కారణకుశలప్రశ్న సూచక బాణద్వయమును వేసియున్నాఁడు

కృపా — నాకునట్లే.

అశ్వ — నాకునట్లే.

భీష్మ — నాకునట్లే.

(అందఱు నిష్క్రమింతురు.)

పునః ప్రవేశము - ఉత్తరుఁడు (సారథి) - అర్జునుఁడు.

అర్జు — ఇట్టిరికిలకేనముల వారిట్టివారని నేను చెప్పిన గుఱుతులన్నియు జ్ఞాపకమున్నవియా?

ఉత్త — ఉన్నవి. విజయా! నాకు భయము నుడవలేదు. నీవైన ససహాయుఁడవై మొల్లు సంగరము చేయుదువు?

అర్జు — భయపడకుము. చూచితివా! రాజరాజు నూరమున జరుగుచున్నాఁడు. వాని వదలరాదు. ఇక్కడివారితో మనకేమి ప్రయోజనము. అక్కడికే పోనిమ్ము.

[వెనుక యవనిక నెత్తిన దుర్యోధనుఁడు కనుపించును.]

అర్జు — సుయోధనా! నీవేలయుద్ధమునకు వచ్చితివి? వచ్చినవాఁడవు విఱ్ఱవీగిపోవుదవు? ఓహో! పశువులఁ దోలుకొనిపోయెదవా. అందుకేనను దగవా? ఇది యుద్ధభూమి సుమా?

దుర్యో — ఏలయింతమాటలాడెదవు. సమరభూమిని నీవచూచినావో? చక్కఁగ యుద్ధమునకు నిలువుము. నినుఁజెండాడెద.

అర్జు — యుద్ధమునకు నిల్చెదఁగాక కొన్నిమాటల వినుము. దానిపై నీవు యుద్ధముచేయుదువన్న శ్రీపాప్తి దప్పించెదఁజూత.

సీ॥ నానాఁటనంత కంతకుఁ బెల్లు పెంగిన
క్రోధానుభూత విరోధిగరిమ।
నీలాంబరుని శిష్యావళి నెల్లనుమేటి
నీవన్నయతుల సభావనంబు।
మోహనాంగిని సభ ద్రోహంబనకఁడీలు
పడ పుట్టమొలుచుకట్టించిశేనంబు।
అరణిదురవాణి యానందమున
ఘోషయాత్ర కేతెంచినయధికగర్వ॥
తే॥ గీ॥ మారయుసమాప్తిగనుటకేఁ దారసిలితి।
సమయమిట్టిది గెలుఁగు టసాధ్యమెందు।
కలఁగిపారక భూపాల నిలిచితేనిఁ।
బూనియివియెల్లఁ దీర్తునీయాన సుమ్మి॥

ఇది కదనరంగముగాక పాచికలాటకాదు. స్వభుజాబలము నమ్మియుండఁజనుఁగాక శకుని కైతవోపాయము పనికిరాదు. మంత్రములఁ జీల్చెడు నశని బాణములు కాక సొమ్ములఁదెచ్చెడు వగదచ్చిబాగలు కావు. ఇందమైన వస్త్రభేదనం బొనర్ప వచ్చుఁగాక యబలకట్టిన పుట్టములూడ్చుటకాదు. ప్రహతగజతురంగ పదాతిజననిర్గత దుస్తవారి పూరంబున మునిఁగి తేలుటగాక నమ్మినబంధువు నట్టేటఁ ద్రోయుటకాదు. బాణాములఁ బరవాహినిఁ గాల్చుటఁగాక లక్కయిల్లు మండఁజేయుటకాదు. కంక గృధ్రాదులకుఁ బ్రతివీరుల మాంసకబళముల విందుసేయుటకాక తోఁబుట్టువులకు విషాన్నమిడుటకాదు.

దుర్యో—"శేషంకోపేన పూరయేత్" అనులోకోక్తి నెఱుఁగని వాడను గాను. ఇవి యన్నియుఁ జేతకాని పందయాఁకటలుకాక వేఱగునా? ఉండక యుద్ధమాడుము.

అర్జు—అయిన నాయితమగుము.

ప్రవేశము (త్వరితగమనమున, భీష్మ-ద్రోణ
కృప-కర్ణ-అశ్వ-(పదాతులు)

అర్జు—ద్రోహులారా! ఈమోహనాస్త్రము సహింపుడు. (వేయును.)

అందఱు— (మూర్ఛిల్లుదురు.)

( ప్రవేశము - అభిమన్యుఁడు. )

అర్జు—కుమారా ! పట్టణమున నేమాయెను ?

అభి—అందఱి సైనికుల నెల్ల నుక్కడించి వచ్చితి.

అర్జు—ఉత్తరా ! నీచెలియలి బొమ్మపొత్తికలు గైకొనుము.

ఉత్తర—(పోయి యందఱి యాభరణములు బట్టలు గైకొనును.)

అర్జు—ఆవైపుననున్న భీష్మునొద్దకు మాత్రము పోకుము. అతనికి యస్త్రబాధ లేదు.

ఉత్తర—అయ్యో ! మిగిలినవారు నట్లే మేలుకొన్న నెట్లు ?

అర్జు—శంకింపకుము.

ఉత్తర—వీరినందఱి నిపుడే నాయస్త్రమున సంహరింతువా ?

అర్జు—వలదు.

ఉత్తర—అర్జునా ! ఈదుర్యోధన కర్ణుల శ్వాసము లేకనా మిమ్మింత చేసిరి. (వారి ముగ్గురికంఠములకు త్రాడుఁగట్టును.)

అర్జును—ఇంకరమ్ము.

ఉత్తర—(వచ్చి) అభిమన్యుకుమారా! ఈయాభరణముల నీవుఁ గైకొనుము.

అభి—(తీసుకొనును.)

అర్జు—ఇంకఁబోవుదము. ఉత్తరా ! నీవు మున్ముందుపొమ్ము. నాసంగతి నేమియుఁ జెప్పకుము.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# బృహన్నల నాటకము.

## పఞ్చమాఙ్కము-ద్వితీయరంగము.

### ఉత్తర నగరు.

ప్రవేశము: ఉత్తరుఁడు - ఉత్తర.

ఉత్తరు — చెలియలా! ఇదిగో నీవుకోరినబొమ్మపొత్తికలంబరములు.

ఉత్తర — అన్నా! అయ్య సభలో నెవ్వడో మహాపురుషుఁడు, సహాయమొసంగినందున, జయముచేకూరె ననిచెప్పితివఁట? ఆమహాపురుషుఁడెవరు?

ఉత్తరు — (నవ్వి) నీకెందుకులెమ్ము.

ఉత్తర — అయిన, నీవేమింతజేసితివా?

ఉత్తరు — (నవ్వును.)

ఉత్తర — ఆహా! ఒక్కఁడవే కౌరవసేన నెట్లుచక్కాడితివి? నీయట్టిసోదరుఁడుండుట పుణ్యమేకదా!

ఉత్తరు — నన్నేలయింత ప్రశంసించెదవు? ఆకౌరవసేనయెంత? ఆమాటలేల. నాకాయాసముగనున్నది.

ఉత్తర — అదియుండనీ? బృహన్నలయెక్కడ?

ఉత్తరు — నేను ముందువచ్చితిని. బృహన్నల రాత్రికివచ్చును.

(ప్రక్క-నిష్క్రమించును.)

( ప్రవేశము - అభిమన్యుఁడు రాజవేషమున. )

ఉత్తర — బ్రాహ్మణోత్తమా! అదేల నేఁడీరాజవేషము పూనియున్నావు!

అభి — బాలామణీ! ఈభూషణములఁగైకొనుము.

ఉత్తర — వజ్రవైడూర్యాదులతో నమూల్యమునుగానున్నవే. ఈపటమెక్కడిది.

అభి—దీనిలోనున్నవారిఁ గుఱుతింపగలవా ?

ఉత్తర—(చూచి) ఏమిది? కంకభట్టయు వలలుఁడు రాజవేషములనున్నారు. ఇతఁడెవఁడు ? బృహన్నలతోఁడఁబుట్టినవా ? ఇందెందరో యిరువురు మనోహరాకారు లున్నారు. ఇక్కడ సైరంధ్రియున్నది. ప్రక్కన నింకెవ్వరో మోహనాంగి యున్నది. దీనిప్రక్కన నెవ్వరు సుందరుఁడు-(అభిమన్యునిఁ జూచి) ఆహా ! నీవే యున్నావు. వీరెవరు? సైరంధ్రిప్రక్కనున్న యామె యెవరు?

అభి—ఈయమ యతని భార్య.

ఉత్తర—బృహన్నలతోఁడఁబుట్టినవాని భార్యయా ?

అభి—అతఁడు బృహన్నల తోఁడఁబుట్టినవాఁడు కాఁడు. బృహన్నలయే—అతఁడే యర్జునుఁడు.

ఉత్తర—ఏమియాశ్చర్యము ! వీరెవరు ?

అభి—నకుల సహదేవులు.

ఉత్తర—ధర్మభీములేరీ ?

అభి—వీరే.

ఉత్తర—కంకవలలులా ? వినోదమా ?

అభి—యువతీ! నేను హాస్యమాడుదునా ? పాండవులఁడజ్ఞాతవాసమున మీ వీటనే యుండినారు.

ఉత్తర—ద్రౌపది ?

అభి—సైరంధ్రి.

ఉత్తర—ఏమిసుదినము ! వీరినెవరు వ్రాసిరి ?

అభి—నేనే.

ఉత్తర—ఈమె యర్జునుని భార్య యంటివిగా ? సుభద్రయా ?

అభి—అవును.

ఉత్తర—ఆమెప్రక్కన నిన్నేల వ్రాసికొనియున్నావు ?

అభి—తల్లియొద్దఁ గొడుకుండరాదో ?

ఉత్తర—సుభద్ర యంటివే నీతల్లి యెట్లాయెను ?

# బృహన్నల నాటకము.

## షష్ఠమాఙ్కము-తృతీయరంగము.

విరాటమందిరము-ప్రవేశము-కంక, వలల అర్జున దామగ్రంధి-
తంత్రీపాల.

వలల—అర్జునా! చూచితివా యీధర్మరాజు తన్నేమి చేసియున్నాఁడు. బృహన్నల సారథ్యమున నుత్తరునకు జయముగలిగెనని యన్నమాత్రముననే యాడుచున్న పాచికలఁగొని మోమున వేసెఁగా ఈవిరాటుఁడు! యిట్టిదురాత్ముని నూరకమాననచ్చునే?

కం॥ జంభారి కాచనేనియు ।
శంభుఁడె రక్షించెనేని చంపెదఁగనుమా ।
శుంభద్గర్వాయుత సం ।
రంభంబింపార మత్స్యరాజాధమునిఁ ॥

నకుల—నా బాణమున నిప్పుడే చూర్ణముచేసెదను.

ధర్మ—అనుజులారా! ఊరడిల్లుఁడు. ఈ ధర్మరాత్ముని సదనమున నిశ్శంకముగ మనమీయజ్ఞాతవిధి నెఱవేర్చితిమి. వీసమెత్తుమాట మిగిలిరానివ్వకుండ నత్యంతానుగ్రహమునం గాపాడినాఁడు. అట్టివానిపై మనము వ్రేలెత్తుట నిందు కృతఘ్నత.

కం॥ పరూపంబున మనకప ।
కారముగావించినాఁడు కారణమేమీ ।
భూరమణునొవ్వనాడను ।
దారగుణాఢ్యులార తలఁపఁగవలదే ॥

తొలుత సుశర్మ నోడించి వచ్చినందుపై నతనిమానసమున సంతోషమునిండారినది. సమరభీరుఁడైన తనయుత్తరుఁడు భండనప్రచండుఁడై కౌరవులనెల్ల జయించి వచ్చినాఁడన్నఁ జెప్పగూడని యానందమునఁ బొంగి మేనుమఱచినాఁడు. మేనెఱుఁగమిఁ జేసినది నేరమగునా? అతని నేలననవలె. మనోదార్ఢ్యముగల నేనే అర్జునా! నీవు కౌరవులగెలిచితివన్న, నుబ్బుచే నొడలెఱుఁగక, రాజునకు మాఱాడి నిన్ను బ్రశంసించితినే. అతఁడవశ్యము క్షంతవ్యుఁడు.

భీమ — నీమాటలు నాకూఱట గలుగదు. ప్రతీకారము యోచింపవేవలయు.

అర్జు — మనమందఱము నిజవేషముల విరటునికెఱింగించుకొందము.

ధర్మ — అప్పుడతండు క్షమాపణముఁ జెప్పికొనకున్న వలసినభంగిఁ జేయుదము.

[ ప్రవేశము - అభిమన్యుఁడు. ]

అభి — (స్వగతము) ఆహా! యిక్కడ చేరియున్నారా? (ప్రకాశము) పిన్న పెద్ద తండ్రులారా! మన్నింపుఁడు. (నమస్కరించును.)

అందఱు — (ఆలింగనముఁ జేసికొందురు.)

ధర్మ — అభిమన్యుకుమారా! నాదుఃఖము నేమనిచెప్పనగును. పేరులంబోఁగొట్టుకొని హీనసేవను నిలిచినదిగాక ప్రాణబంధువులఁజూచినను మాటలాడింప కుండునట్లు చేసినది.

అభి — తండ్రులారా! మీరు నాకుఁ జెప్పవలయునా! మీకిట్టి దుఃఖస్థితివచ్చినందుకై ఎంతయో దుఃఖించితిని. ఆహా! మీ రెంతపరిభవము నొందితిరి.

అర్జు — కుమారా! ఊఱడిల్లుము. ఏమున్నకాలమునందంతయు నింతదుఃఖము గలుగదయ్యె. ముందున్నదే. దాని నెట్లు మీఱవలయునని యోచనఁజేయుచుండఁగా ఇప్పుడింతయుఁ గడచెనని వినఁగదా చెప్పరానిదుఃఖ మావహిల్లుచున్నది.

ధర్మ — చింతించి ప్రయోజనమేమి? ఊఱడిల్లుఁడు.

(యవనిక దిగఁజారును.)



భీముఁడు — మహేంద్రు నర్ధాసనమున వెలసియుండినవాఁడు, అప్సరోవధూమణియగు నూర్వశితానే మోహించి పైఁబడినను చలింపని జితేంద్రియుఁడు, ఈశ్వరునితోఁ బోరాడినను వెనువడఁడను దివ్యాస్త్రవేది, చండగాండీవ కోదండ పాండిత్యవిలాసుఁడు. మఱి నిన్నఁ గౌరవానీకమంతయుఁ దానొక్కఁడె చక్కాడిన కిరీటిశేఖరుఁడు. శాపమునఁ బేడితనమున బృహన్నల నామమున నిన్నాశ్రయించియుండిన సముదాత్తసుండగు నర్జునుఁడితఁడే సుమా.

ఉత్తరు — నిన్న నీయుత్సవముఁ దనకేల చెప్పవలదన్న మానితిని. నాకు జయ మొసఁగిన మహానుభావుఁడితఁడే. ఇందుమూలము. తండ్రి నిర్మించిన కుమారుఁడు. ఎందును గొఱవడని రణభీషణుఁడు. భోగజితశత్రుమన్యుఁడు సుగుణమాన్యుఁడు. ప్రత్యక్ష నిహన్యమానజన్యుఁడు. అభిమన్యుఁడు.

విరాట — ఆహా! ఏమి నాభాగ్యము. ఈదినమే సుదినము. ఆహా! కంకభట్టా — కాదు ధర్మాత్మజుఁడా! నీకెంతయు నపరాధము గావించినాఁడ. స్వీయబలప్రాభవము యట్లుండఁగాఁ జెట్టనికోటలవలె విలసిల్లుతమ్ములచేఁ బరిరక్షితుఁడవగుని కాకల దుర్యోధనుఁడైన నిన్నేమి చేయ నేరఁడుకదా? అట్టి నేను నీమోమున రక్తధారఁ దొలఁకునట్లు చేసితినే. నన్నుఁ బరిపాలింపుము. (నమస్కరించును)

ధర్మ — విరాటరాజా! నీవేమున్నవాఁడవని యింతప్రార్థింపవలెను? నీగృహవాసమున నీవత్సరమంతయు నుండి పాలింపఁబడితిమి. వాదమునఁ గెలిచిన కోపమున నీవు శిక్షించుట నేరమా? రాజవగు నీయెదుట మూరాడినందున సేనక ధర్మమునకు వెలితియయ్యె. నాకాశిక్ష తగినదే. అదియుఁగాక, జూదమువలన నాలరాజ్యము నోడి శ్రమకు నోర్వనిచిన్నతమ్ములను, నెంతకైనఁ దగని యిల్లాలిని నాతోఁ గూడ నింత వంచరింపఁజేసి, యట్టిస్థితి నుండియు, మూఁట, మూఁటఁ జూదమాడు నభిలాషగలనన్ను నంతగా నింక నెంతశిక్షించినను గొఱఁతయే. నీవు నాయెడ నిట్లు స్వాతంత్ర్యముఁ జూపుట నీ క్షేమము వెల్లడి చేయుఁగా.

కం॥ ఏపారమమ్ముఁ జేకొని ।
భూపా యీవత్సరంబు భూరికరుణచేఁ ।
గాపాడితి నన్ననఁగాఁ ।
బాపంబగుఁగాదె ధరణిపాలకచంద్రా ॥

విరాట — నాయపరాధభారమున నాకేదియుఁ దోఁపదు. అభయమియ్యవలయును.
(నమస్కరించును.)

ధర్మ — రాజేంద్రా! త్రికరణశుద్ధిగా నాకుఁ గనలేదు. ఏబాసనైనఁ జేయుదును. నీవేమి చేయుమన్నఁ జేయుదు.

విరాట — ఏమిచేయుదున్నఁ జేయుదునని వచనమిచ్చినందున సాహసించెద.

(అభిమన్యునకు నొసఁగుచు — నుత్తరఁ బాణిగ్రహణ మొనరింప నొడంబడి —

ఉత్తర — చక్కెర చల్లి పాలలోఁ జిందినట్లాయెను.

ధర్మ — ఉత్తరా! అదియేమి?

ఉత్తర — అభిమన్యుని మోముఁజూడుఁడు.

అభి — (లజ్జించును.)

విరాట — వీరివురికి నప్పుడే మోహమంకురించియున్నదా?

ఉత్తర — అంకురించియున్నదా? అంకురించి, పెరిగి, పెద్దై, శాఖలతోనిండి విస్తరించియున్నయది.

భీమ — అట్లైన మిగులమేలాయె.

ఉత్తర — ఆవృక్షము పదినెలలో ఫలవంత మగుటకు నేను [illegible].

ధర్మ — అభిమన్యూ!

అభి — (లేచిపోవును.)

ధర్మ — విరాటరాజా! ఇంకసంశయమేల? నీబాంధవ్యము గలుగుట నా పుణ్యమునకు [illegible]

విరాట — సేవకా! మాయుత్తరను పిలుచుకొని రమ్ము.

[ ప్ర॥ ఉత్తర. ]

ఉత్తర అభిమన్యులకు కల్యాణము జరుపుదురు.

మంగళము పాడుదురు.

( అనుబంధము 48. )

యవనిక దిగజారును.

బృహన్నల నాటకము సంపూర్ణము.

శ్రీ

# బృహన్నల నాటకము.

## ఉత్తరరంగము.

[ఒకానొకనటుఁడు ప్రవేశించి]

ద్విపద—శ్రీరాజితము బుధ చింతితదాయ
కామాక్షి వెలయు బృహన్నలచరిత
మాలకించితిరే మహాజనులార
చాలసీ పాండవ చరితంబు గనుఁడు. 4.

అలఘుగుణాధారులై యుండితమకు
నలనందనందనుం డమఁగు గాసుండి
[illegible]ముకనాటిజూదాన సుజ్వాలబహుళ
సకలసంపదలను జయ్యనఁబాసి. 8.

పదియును రెండేండ్లు వనమునఁబడిరి
అదిగాక యొకవర్ష మజ్ఞాతభంగి
విరటుని ప్రోలస్వవేషముల్ మాని
గురునీచవృత్తులఁ గొల్వుండిరకట. 12.

యీలాగు వగఁజెంది యేమనవలయుఁ
గాలంబు దరియింపఁ గా రాదు సుండి
వారేల కౌరవ్య వరుల నుగనుఁడు
పారిచాదముఁ జూడఁ బరమాద్భుతంబు. 16.

పరశురాము నిబాహుబలమహోద్దాము
తిరుగంగఁ దోలిన ధీరుఁ డొకఁడు
అరుదుగా నస్త్ర విద్యలకు మగండు
గురుతేజుఁడగు ధనుర్గురుఁ డొక్కరుండు. 20.

అతనికంటెను శూరుఁ డతిరథశ్రేష్ఠుఁ
డతులవిక్రముఁడు కృపాచార్యుఁ డొకఁడు
ఇటలాక్షునంశ జన్మించినయట్టి
పటుబలుండా హవభర్గుఁ డొకఁడు. 24.

తేజంబునను దిక్కు దిక్కులకెల్ల
రాజరాజను పేరఁ బ్రబలెనొకండు
ఆక్రమించి యర్జును ననిఁ గూలనైతు
వెలిపేదియను మేటి విలుకాఁ డొకండు. 28.

పోటునయమునైనఁ గారిప్రచ్ఛఁగడఁగు
పోటరివిలుకాండ్రు పోరిఁ బెక్కువేలు
అంతటివారొక్క యర్జును నోర్వ
నెంతయుఁ జాలక యిట్టు క్రిందఁ బడిరి. 32.

యీలాగయిననిక నేమనవలయుఁ
గాలంబుదరియింపఁ గాదాసుడి
ఈకీచకునికంటె తేజనులార
పాకారికైనను బ్రతియగువాఁడు. 36.

ఘనబాహుబలధుర్య కంజాక్షశౌర్య
జనదద్రిధైర్యకీచక వర్యయంచు
భూజనంబులు సర్వభూములఁ బొగడ
రాజన్యులరులని రంతరమిన్వ. 40.

దారుణంబుగ వసుంధర నేలినాఁడు
వీరశ్రేష్ఠుఁ డంచుఁ బేరొందినాఁడు

భీముఁ డొక్కఁడు దక్కఁ బృథివి వేఱొక్క
భూమీశుఁ డసితోఁ బోరాడఁగలఁడె 44.

పరసతీమణిభంగ పఱచిన పాప
భరమున మతిఁ దూలి వరశక్తి సోలి
ప్రాభవగతి మాలి పడియెఁ గాకున్న
నా భీముఁడైననే మతనికి నెనరె. 48.

దుర్మార్గవృత్తి బలుగ్రోగ్రహమతి
ధర్మనందను రాణి తలిరాకుబోణి
నలఘువిలాసపే మాయతనాస
నళినంతలాళిన త్యధిక పాంచాలి. 52.

నాఁడు బాధ చేసిన హీనకీచకుఁడు
నిటుకటా తలపోయఁ గా రాదు గాదె
తుద కుఁదానేమి సంతోషంబుఁ జెందె
తుదలేనిదుర్బుద్ధితోఁ దానే మ్రందె. 56

ఈ బహుబలధుర్యుఁ డీయస్త్రవీర్యుఁ
డబలాహృత ధైర్యుఁ డేమాయె నకట
యీ దశ నిభంగి యేయిష్టులుండ
లోకులన నులనా లోచింపవలెనె. 60

అపకీర్తి యొకటి పాయని పాప మొకటి
యుపతాప మొక్కటి యురుదుఃఖ మొకటి
పరిభవ మొకటి ప్రాభవహాని యొకటి
చిరభీతి యొకటి హెచ్చిన వైర మొకటి. 64

ధనహాని యొక్కటి తనహాని యొకటి
ఘనభయంకరనరకంబె యందొకటి
అతికామమున రావణాసురుఁడీల్గె
క్షోణి నిందఁదలపోయఁ గీచకుఁడీల్గె 68

కాపునధరవర కాంతలమీఁది
భావమెన్నఁడుగాని వలవదు సుండీ
ఈకీచకాధము నీక్షించుకంటెఁ
బాకాసుతునింత పరికింపవలదె. 72.

మాయయ్యలేయింతటి మహిమంబుభూమి
నేయెడన్నైనఁ బ్రతీక్షించినామె
ప్రజ్ఞావిశేషులై భాసిల్లువారు
యజ్ఞయాగానుల నడరించికాక 79.

యే కాంతమైసిరి నీక్షింపలేరొ
భూకాంతులై యుద్ధభూములఁజేరి
భీతిల్లకనిచేసి పృథ్వీపైసిల్గ
కేతన్విసంభోగ మెఱుఁగంగలేరొ. 80.

అమరనిరాహారులైతపశ్చర్య
లవితాభ్రములుచేసి యఖిలవృత్తముల
నిత్యసంగముల మానినవారలైన
భృత్యోత్సాహమునఁజేసి వెలయంగఁజాలు. 81.

నేవాఁకడగంటి నెనఁగువాల్చూపు
దీనుఁడై వేఱొక్క దిక్కు లేదంచు
నడలెదనంచుదా సోహాన్నటించు
నెడఁబాయనంచు నీవేదిక్కటంచు. 88.

నాపురూరవసుఁడ హాస్యధైర్యంబు
పపంకజానన కిలదాసుఁడయ్యె
నామానినీమణి యామోహనాంగి
యాముద్దులాడియా యలరుపూబోఁడి. 92.

ఆయుర్వశీసతి యనదయైతన్నుఁ
బాయకొండినముద్దు పల్కులుదనర

సశరీరసుఖమున్వఁ జనుదెంచిదేవ
కృశమధ్యవరునిపైఁ గేవలమోహ. 96.

మతి వేలమైనిండ నకట తానెంత
బతిమాలినను బల వంత పెట్టినను
నోజ కాదనినిర్లోభ నోప్పక పోయె
నిజ తేంద్రియతయెం దేనియుఁగలదె. 100.

ఆదివే మిషగని యూలా తాదువావి
గదురని వేయేలు ఘనసుర వేశ్య
ఆట్టియుంటినిఁదన యయ్యాచేపట్టి
నట్టియింతియటంచు నటుపారఁదోలె. 104.

మాచితిలోయెంత సొబగుఘటించె
చకనికిఁగిడికనిషేధమురము
బలుకించకనిబుద్ధి ప్రజలకుఁగలుగ
నినను బతివ్రత లెందుండువారొ. 108.

పోలనియజ్ఞను బుద్ధిగల్గంగ
నిలోకమున వేశ్య లెందుండువారొ.



# అనుబంధము.

ఈనాటకమున నక్కడక్కడ ననుబంధమున సంఖ్యలు సూచింపఁబడియున్నవి. ఆసంఖ్యలు వేసినచోటులనుండిన పాటలీక్రింద నుదహరింపఁబడియున్నవి.

1. రాగము-ఖమాజు. తాళము-రూపకం.

ఇంద్ర—సంతస-మానెను-కమనీ-యమణీ-రమణీ ॥ ॥పల్లవి॥
నీదగునాట్యము-మోదము నిచ్చెను ।
గాంచిలిమెచ్చఁగఁ-గలనా-లలనా-యోలనాగ ॥ ॥౧॥
అలవడుమాధురి-కలగానమునను ।
బాలుపుమీఱెను-సొలపుల్-పలుకుల్-గులుకుల్ ॥

2. రాగము-పీలు. ఆదితాళము.

ఊర్వ—భారమునా-రతిఁగోరుదాన ॥ ॥ప॥
నీమహిలాసము-నిండెనుమది నీ
పాదములానఁ-బల్కుదాన. ॥౧॥
వడిశరమ్ముల-వంచనసేయుచు ॥
నన్నుఁబ్రతుకఁగా-నీఁడుమారుఁడు. ॥౨॥

3. రాగము-నాదనామ ఆదితాళము.

అప్స—తగునే యీరాగతినాడ-నీమతి-రాగమానీకు ॥ ॥పల్లవి॥
ఈపరిపాటిగ-నెట్టులఁబలికితి-
తాపముగలిగెను నాహా-తల్లిరో-పాపమనవే ॥ ॥౧॥
చింతనేయ సేయు-వింతేటిమాటల-
నెంతంగఁబలికితి వాహా-తల్లిరో-సంతాపముమీఱే. ॥౨॥

4. రాగము-కేదార. రూపకతాళము.

ఊర్వ—కనుఁగొనవమారమునా-కాముబారికోర్వఁజాల ॥పల్లవి॥

అనుబంధము.

అర్జు—పలుకకు మాజననీ-పాపవేగమాపంజాల. ॥పల్లవి॥

ఊర్వ—ధరణీనాథ వేమదాన - సురతసౌఖ్యము - వరుసమాంకు లేదు
కరుణజూపి కావుమింక. ।౧॥ ॥కను॥

అర్జు—అమరనాథుంగూడి-యిట్టులాండజెల్లునే
కొమరుడైన నన్నునిట్టు-లమమ్మపేమంజూడనానె ॥ప॥ ॥౨॥

ఊర్వ—నీ-కే-లా-నా-థ ॥కను॥ ॥3॥

అర్జు—మే-లా-యె-మా-త. ॥పలు॥ ॥౪॥

ఊర్వ—అమరీమణివే-డగదో-లెదవే-తగునే-పలుకకు ॥కను॥ ॥౫॥

అర్జు—జననిం-దలుబొం-దగ నా-కగునె-తుదకౌ-నరకము ॥పలు॥ ॥౬॥

ఊర్వ—ఈమాటలా నీకే-పాపముగలుగదుగా-యోపగ-పలుకులు॥
పలికెదు ॥కను॥ ॥౭॥

అర్జు—మాతాయీమాటలా-పాటిగొందగునె-
యేటికి నుడువులు నడివెదు ।పలుక॥ ॥౮॥

ఊర్వ—ఊరకపలికెదవు-యోరుచమరునకునె - సారసదళనయనా-
సరము పిరసము సలుపకు ॥కను॥ ॥౯॥

అర్జు—సారెకుపలికితినె-కోరకుమదిజననీ-
కూరిమితెగదననే-గురుతర దురితము-సరయుప్పు ॥పలు॥ ॥౧౦॥

ఊర్వ—తమకమువగ ని త్తైనన్-సమరసమది రాదయె
సుమశరునకు నే దాళ-కమలగననువాడే నేనా
రమణుడయన దనువిమువకు ॥కను॥ ॥౧౧॥

5. రాగము-కానడ. అటతాళము.

అర్జు—ఇంక వినంగజాల-నీగాథ
ననుగనలజేసె-నీవేథ ॥పల్లవి॥

అనుబంధము.

గాసిలకేదినా-యాసముఁజెందఁగ
జేసితి వెంపపరాధ ॥కు॥ ॥౧॥
తల్లి వినీవై-తనయునిఁగోరు దే.
గొల్లను సేదగుబోధ ॥ ॥౨॥

౬. రాగము-ధన్యాసి. ఆదితాళము.

ఊర్వ—మరుబారికి-తాళఁజాలఁ గాంతా
గురువైరము-చూపఁదగునె యింతా ॥ ॥పల్లవి॥
దేవరమణి వేడఁ-బోవఁ దోలఁగనీవు.
భావమునకు ధర్మమా ॥ ॥౧॥
ప్రాణనాథుడమది-లోననమ్మితినిన్ను
దీనను ననుఁగావవె. ॥౨॥

7. రాగము-కేదారగౌళ. తాళము రూపకము.

అర్జు—అయోఘోరతరశాప
ప్రయోగమున కోర్వజాల ॥ ॥పల్లవి॥
వికలితమై చాపశర-ప్రకరంబుల మానజేయు
నకటకటా యెట్లునపుంసకభావము నోర్చువాఁడన ॥ ॥౧॥
ఎటువంటి హితాంగిబీ-షటుశాపము పాలయ్యెను
కటకటయీ దేవికిసి-కటికబుద్ధి యేలఁగలిగె ॥ ॥౨॥

౮. రాగము బిలహరి. తాళము ఆది.

ఇంద్ర—నిన్నుఁబోలువారులుందు రే-యీలోకమునఁ
జెన్నారఁగ నెంతబలు-విజ్ఞానము గలిగిన ॥ ॥పల్లవి॥
ఇంతచిత్రమైనభంగి-నీవుచేసియున్నవాఁడ
వింతవారలెవ్వరుండు-రీజగంబులోనఁ జూడ ॥ ॥౧॥
దేవకీరవాణివెంటఁ-బోవఁగోలు నిగ్రహంబు
లేవిధంబులనుగార-వించి మెచ్చి నాఁడ సుతా ॥ ॥౨॥

అనుబంధము.

9. రాగము-పూర్వీకల్యాణి. రూపకతాళము.

శకున— ధైర్యమొదల నెలా-తలఁకవలదు భూమిపాల ॥ ॥పల్లవి॥
చిరరాజ్యము సమకూరెను-సకలంబును నీదయ్యెను
మురలక వనవాసముని-యురులకుఁ జేకూరు ॥౧॥
గురుయోచన చేయఁగనిక-నేటికి మదినూరడుమా
కురునాయక నీభాగ్యము-కోరఁబొందు గలుగనేర్చు ॥౨॥

10. రాగము-పీలు. తాళము-ఆటతాళము.

అందరు— హేలారాయునరాణి-కాశీభవాని
పాలింపుము(రాణి-పరమకల్యాణి ॥పల్లవి॥
అనుదారని నిన్ను శంకరి నమ్మినాము.
కరుణించి మమ్మింతు-దరిఁజేర్చవమ్మా. ॥౧॥

11. రాగము-జంజూటి. రూపకతాళము.

బృహ— శీలసుగుణ మత్స్యభూ-పాలపుంగవా-
బాలనామప్రార్థనంబు-నాలకింపుమా ॥ ॥పల్లవి॥
నవ్యభరతసంగీత నాట్యవిద్యల-
భవ్యకీర్తిఁగన్నియలకుఁ-బరగఁ జెప్పుదు ॥ ॥౧॥
వేడువాఁడ నీకు సేవ-చూపుకొరకును
బేడిబృహన్నల యనంగఁ-బేరు నాకును.

12. రాగము-మోహన. ఆదితాళము.

బృహ— సముదారా ధీవరా
శౌరిత సురాఁజుఁడు దానుఁడు ఘనుఁడు ॥పల్లవి॥
ఘనఘనవాతని విచలింపఁగనా-
వనజాసనునకు-ఘనము గాదే. ॥౧॥

అనుబంధము.

13 రాగము-బ్యాగ్. ఆదితాళము.

కర్ణ—పడవేయునె-భండనమ్ములోన ॥ ||పల్లవి||
ఎటుతాళువాడా-కులాత్ములకై
యిటులేటికిఁ బటుచింత చేయ ॥ ||౧||

ఘనశక్తియింత-యును లేనివారు
మనుజేశ్వరా-యనిగూల్పనేరనే. ||౨||

14. రాగము-కల్యాణి. ఆదితాళము.

శకుని—సమ్మదంబునను-చాలమేలుగలిగె
నమ్మయోచనలు-వలను సేయఁగ. ||పల్లవి||
ఉగ్రకేళి యిటు-వాదములాడె
నారరీతియగునె-యిట్టులాడంగ
కారణమేమి-పనెటు-వైరి-
నూరడిల్లు-విధంబు సేయంగ ॥ ||౨||

15. రాగము-సౌరాష్ట్రి ఆదితాళము.

శకుని—వారిగళ్గెభళిరె-భళిరె నేడు-వైరులను వెలారిది వైరమున-
బాధసేయుంగను ॥ ||పల్లవి||

దురాచారులను-దుర్ణీతిపరులను-విరోధులను మిగుల-
దురాపతాపముల-పాలు చేయఁగ-నగణ్యవాసముల-
కంపగభళిరె ॥ ||౧||

16. రాగము-బ్యాగు. ఆదితాళము.

చారులు—రాజ-రాజపురీగ్రామ-రాజిఁజెత్తుము
రాజిఁదెత్తుము-మీకుఁ-దేజమిత్తుము. ||పల్లవి||

అనుబంధము.

ఎట్టైనా పాండవుల ముట్టివత్తుము-
ముట్టివత్తుము-వారి-బట్టి తెత్తుము. ॥౧॥

17 రాగము-సురటి తాళము ఆది.

ఉర్వ — ఊలలనామణి-కెంతటిసుఖమో
చాలఁగ నింతటి-లీలఘటించె ॥ ॥పల్లవి॥
ఊనలినాక్షికి-దీనతగ్గాను
ఊనంపుసకుం-దెలిసకతిన ॥ ॥౧॥
పంచుసనిఁబుం స్త్రీవి-ఖండునిఁబొందిన
యండజయూనకు-నుండదెసుఖము ॥

18 బిలహరి-రాగము. ఆదితాళము.

చక — గడపవలెనిక్షోంత-పిలయనాకారత-
యూరంభూతినారత-యాలఘునీరత. ॥పల్లవి॥
నవులసుగులఁ ద్రోయనె-కరుగఁగారాయనె-
దొంలఁబొరల వేయనె- దూలఁజేయనె ॥

19 రాగము-బ్యాగ్ — ఆదితాళము.

కీచక — అంగజుని-బంగారు-మంగళాంగి — యీనారి
సింగారు మంగసాకృతి-గనువలె-
రంగు మచున్నదిగా-యీ-భృంగవేణి ॥ ॥పల్లవి॥
కోకారిశృంగారియో-కాక-పాకారిదేవెరియో
కాకున్న నారంభ-యోకనకాంగియో.
యీకాంతయుందు నైభూ-లోకమున లేకయున్న ॥ ॥౧॥
లేదేనిరుద్రాణియో-యీభూవారుపూబోణియో ।
కాదనిపరించి-కాంతామణియోయీ
వేదండగామిని-వాదమేల కాదఃకాదు ॥ ॥౨॥

అనుబంధము.

20. రాగము-బిలహరి. ఆదితాళము.

కీచ—భళిరేయేమి పుణ్యమీవు సల్పినాఁడవో
లలనబల్కుటాక్షుదీప్తినెలసెనీపయి ॥ ॥పల్లవి॥
మేలిముద్దు చిలుకపలుకు లీలజూపుచు
బాలనీదండఁ బలుకు మేలుచాలదె ॥ ॥౧॥

21. రాగము-అఠాణా. తాళము-రూపకం.

ద్రౌపది—మానసము లోననింత ప్రాణేశ్వర ।
దీనగతి-యేనాథను-నేనెందను-గానఁగద ॥పల్లవి॥
ఊరకిటు-లాదైన్య-కోరికయె-సల్లాపమొ ॥
బీరమా-నీకు-బీరమా-సుకి-చారమా-భుజ-సారమా
వైరిఁబోరిగొనుటయె-భారమా-పాటింపగ ॥ ॥౧॥

22. రాగము-కాంభోధి. తాళము-ఆది.

ద్రౌపది—పరిపాలించి తేరమణ-నాలీల-లాలించి-చాలా-దయచే
కాలానుకూలామె-యాలాంగొనరె ॥ ॥పల్లవి॥
ఆమోదమున నీను భానుని కొసఁగినఁ
నీమాట-నేమించు-భీమా మిగుల ॥ ॥౧॥
ఈవేళ-నావగ-బోవఁగఁజేసితివి.
కావవె-మహాను-భావా క్రొముక్కద ॥ ॥౨॥

23. రాగము-తోళము. హంసధ్వని-రూపక.

ద్రౌపది—ఎందకీ-భంగిసన్ను-తింపగా-చంద-మారయఁగ
మందు-రా-ఁ-న్నా-హై-మహిత వెలయఁ-బలికెదపిటు ॥పల్లవి॥

అనుబంధము.

ఊర్వ — కాంతసీ-చరితమెన్న-వింతగా । చింత-సేయుగును.
సం-తో-ష-ం-బు-న్నిం-చెద । బాగడఁగనిను-నలవియగునె ॥పల్లవి

ద్రౌపది — సంతోష-మమా-త్రైనఁ-కాంతా-నన్ని-రీతిఁ ।
వింతగసుతి-యింతు రెయిది-యొంతటిపని-యింతపొగడ ॥౧॥

ఊర్వ — ముగువకొ-సదమల-చరితము-జగతిని-నిలిపితి ।
వరుదుగ । పొగడ-ఁదరమె-మిగులవగల ॥

ద్రౌపది — సన్నిటు-లారక-యూడకు-మెన్నఁగ-నీదగుప్రీతియు ।
మన్ననినా-కున్ననుజా-లున్నవలా - మిన్నవృక్ష-వున్నతిమె-నె
న్నఁదుక్షి-మనంబుననను-ఘనాధరణ-దనర్చినను-గనుంగొనవె ॥౩॥

ఊర్వ — చండబలవిలసితులౌ-పాండవులునిచునరయుచు-నుండగనుదొ
సఁగులుసి-దండమెలఁగి-మెందుకొనుచు-నుండఁగలవె-
చెండ బనుసు-విచారఘన-కచావలదు-
పచారములు-వచింపఁగను పండువుగఁగంటినిగద ॥ ॥౪॥

24. రాగము-కపి. ఆటతాళము.

ఆద:బు — అనఘ మాదగుప్రార్థనంబుల-గనికరంబున బెంపవే.
వినుతిచేసెదమీాదురాత్ముల-ఁగనలిమనమువిడిపింపవే ॥పల్లవి॥
నిదు సేవకుల కటమప్పున-నాదరంబునఁబట్టిరీ
యీాదురాత్ము నెలంత చేసినగాదుమమ-పడఁగొట్టిరీ ॥౧॥
వివరణంబు గధర్మసుతుడని-భీముఁడజ్జనుడంచునూ
గవలుద్రౌపదియంచుమముబలు-గాసిపెట్టిరిభూవరా ॥౨॥

25. రాగముకాంభోజ. రూపకతాళము.

దర్శో — చాసంతసమూామె మాకుచు మేలునిండెగా-
మదిదఁకలపగ ॥పల్లవి॥

అనుబంధము.

పోలవైరులకీడో నేను - ఏలావుటిదియాలోచన - లీలాగునే
దేలించగ ||
కనుసాహసము డరింపుము - గుడియడ్డనుల బడలించుచు
వాడి విరటుని గోధనమును - నడిచి బాదివిన - గనుచేలయును - దాను
కొనవలె బహువారలు || ||౧||

26. రాగము-బ్యాగ్. ఆదితాళము.

శకుని—సంతసించు జేసె నేడుగా వెసు దినము || ||పల్లవి||
భూరి సామ్రాజ్య-వైభవ మెల్ల-చాలసిరి నిచ్చె
నేడుగాదె సుదినము || ||౧||

27. రాగము-కల్యాణి. ఆదితాళము.

ఉత్తర||—ఈమహానుభావుడు-కాముని నోమిగాడో ||పల్లవి||
పరగంగ నిండి రాజశేఖరేణి మాలించరా
ధరణికి వచ్చిన-సరసిజ నేత్రుడో || ||౧||
తనకు సాటి నేనను-మనసున బుట్టగా
జనపాలుడైనయా-పశుపతి మిత్రుడో || ||౨||

28. రాగము - తాళము.

అభి—పాపము గాదా-నా పాపము
తాపము దీర్చి యీ పదలను-బాపగ రాదో || ||పల్లవి||

29. రాగము-భైరవి. రూపకతాళము.

ఉత్తరుడు—నగధీర-సుగభీర-నానానామవిహార,
తగనీ చరిత్రము చెప్పవే-ధరణీనిర్జరవీర ||పల్లవి||
పూనిన నీ సత్యమునకు భువినీయంతయు నదరవచ్చే.
నీ నామము దేమిగునో-నెమ్మి నాకు జెప్పరాదె ||౧||

30 రాగము-నాదనామ ఆదితాళము.

ఉత్తరుడు—అయ్యో యయ్యో చచ్చితి.
ప్రాణము పోయె-నయ్యో ||పల్లవి||

అనుబంధము.

తల్లియుండఁగ్రహలు-నెల్లరుండంగా.
చెల్లుగావచ్చెనే-యెల్లనుచాపు ||౧||
ఈపాటు గల్గునే-భూపాలసుతుఁడను.
ఈపాము నాకేడ-దాపురమాయెను ||౨||

31. రాగము-సురటి— ఆదితాళము.

అభి॥——సారసాక్షి ద్విరదగమన-చారుసిలవేణీ ॥ ||పల్లవి||
ఇట్టివానికిప్పుడెట్లై-లెట్లులైతివి ।
మట్టుమీఱు-నమ్మఁజాల-మానినీమణీ ॥ ||౧||
సాదరంబుదీరనిందు-మీదనేయుహా.
నాదుమోహ-మేమనంచు-నమ్మఁబోకుమా ॥

32. రాగము-భూపాల ఆటతాళము.

ఉత్త॥——నా వరరత్నము-నా భాగధేయము.
నా జోడు చెలికాడు నన్నుఁజూడరాదే ॥ ||పల్లవి||
ఏరీతి పాపముననే-యీరీతిగలిగెనా.
ధీరకుమారుని-జేరఁగరాదో ॥ ||౧||

[illegible]. రాగము-సవరోజా. ఆదితాళము.

అభి॥---ఏమి నేరము-నెంచఁబోదుమీన దైవమింతచెచ్చె ।
ఆమహాత్ములిట్లులైరి-అయ్యయోనే-నెట్లులుందు ||పల్లవి||
తామసన-కోపఁజాల-దైవమేమిచేసెనన్న.
ఁబాపడంచు-ఁబలుకరైరి-పాపమనువారులేరె ॥ ||౧||

33. రాగము-శంకరాభరణం. తాళము-ఆది.

ఉత్తర॥——పో-రా-డ-సి-రై-పోవకే మద-కారపుబలా ||పల్లవి||
నాచాపబాణములే-చూచినఁబారరే-
సిచులవారల-పీచమణఁడఁతూ ॥ ||౧||
సామజపాలికే-సరితోడఁబోనిన-
భామలోయెందును-క్షేమముగల్గునే ॥ ||౨||

అనుబంధము.

35. రాగము-అఠాణ. రూపకతాళము

ఉత్తర— నిను వేడికొందునన్నా-చాలగ-మనసార నాదు
ప్రార్థనం-బను రాగ మారచేయుగను ॥ ॥పల్లవి॥

ఉత్తరుడు— అదియేమి చెప్పుమమ్మా-కోరికక ; ముందమారనేమి
కోరినా-నొదవింతు నేల సందేహము ॥ ॥పల్లవి॥

ఉత్తర— కురుసేనవెల్లను నీవు-బరిమార్తుగాదె యాజిలో-
మతినాదు బొమ్మలాటలకై-పృథదంబరంబులివే డెద ॥౧

ఉత్తరుడు— ఇదియెంత కార్యమెయమ్మా-మదినూరడిల్లు చెల్లెలా-
ముదమార బొమ్మపాత్రికల్-కొదలేక యుండనేదెచ్చెద ॥౨॥

36. రాగము-బిలహరి. ఆదితాళము.

అభి— ఏమివిచిత్రమో-యేమియుదెలియదు-
నామదిశంకయు-వేమారుగలిగెడు ॥పల్లవి॥
భీతిల్లకె తయ్యె-బ్రీతిసారథ్యమున-
కేతెంచు నాతడే-నాతండ్రియౌనో కో ॥ ॥౧॥

37. రాగము-జంజూటి. రూపకతాళము.

ఉత్తరుడు— అమ్మాయమ్మాయమ్మా-యిదియేమి సైన్యము-
ముమ్మరంబుగా-మూగినిలిచెను ॥పల్లవి॥
అబ్బాయబ్బాయబ్బా-గబ్బిబ్బులాయెను-
మబ్బుమూసెను-ఉబ్బికోలకు ॥ ॥౧
అయ్యో-అయ్యో-అయ్యో-వేయ్యేల చాలను-
కయ్యమునకు నా-కాలునిలువదు ॥ ॥౨॥

38. రాగము-జంజూటి. ఆదితాళము.

ఉత్తరుడు— చావుదప్పె-నా-జీవముప్పె ॥పల్లవి
కౌరవులతోడను-బోరాడువాడనే
వారిజూచినంతనే-నీరువట్టుపుట్టె ॥ ॥౧॥

అనుబంధము.

పంప్రమాట చేయక - వల్ల కాటిసారధి -
కొంపఁగూలిపోవఁగాఁ - జంపుచుండెనన్ను ॥ ॥౨॥

పూరకంగమంతయు - వడవడవడకె -
పారివచ్చినంతనే - ప్రాణమింతదక్కె ॥ ॥3॥

ఉత్తరుఁడు — ఇదేలా - యింతబలవంతమయ్యెనీ -
పదంబులన్ - మొక్కువాఁడ - పారనిమ్మనీ ॥పల్లవి॥

బృహ — కుమారా - భీరుభంగిన్ - బోవనౌనే రా -
ప్రమోదంబౌ - నమ్మనన్ను - రమ్మురమ్మా - యో ॥పల్లవి॥

ఉత్తరుఁడు — భయంబయ్యె - జాలజాలు - యుద్ధమాశనే -
నయోనా - ప్రాణమింత - మానరాదేని ॥కి॥ ॥౧

బృహ — వచోగితిం - బాటిసేయు - భంగియాడవే -
విచారంబేటికింత - నేనుగల్గరా ॥ ॥౨॥

40. రాగము - హిందూస్థాని తోడి. తాళమిశ్ర.

ఉత్తరు — అక్కటా సారధి - యెక్కడికి పిల్చెను ।
దిక్కులేనిభంగి నాకు - నెత్తు వెసియిల్లుగాల ॥పల్లవి॥

చావువచ్చె నేని నాకు - జీవయేల చెప్పుచుమా ।
దైవమేమిచేసెనన్ను - దాళిబాలతల్లి దండ్రీ ॥

41. రాగము. తాళము.

ఉత్తరు — నాకయ్యె ప్రాణభయము - పోకార్పగ నె ॥ ॥పల్లవి॥
తామసమునసీకియ్యేడఁ - దాలిమిగలుగదు మదిలో
నామనకనిఁదగజేకొని - ప్రేమ్బోవరాదెనను ॥ ॥౧॥

అనుబంధము.

పాపము పుణ్యమనకయో-పాపిసాంద్ర దయామూలి-
నా ప్రాణము నాకొసంగి-కాపాడువారు లేరే ॥ ॥౨॥

42. రాగము-జంఝూటి. రూపకతాళము.

బృహ—దేవదేవ దైత్యవిదారణా-లోకకారణా ।
పాపవారణా-లోకకారణా పాపవారణాలోకకారణా ॥పల్లవి॥
ఇందిరాపతి కేశవా-నీలనీరదసన్నిభవిగ్రహా-(హరి)
సుందరారవిందహారి విలోచనా-భవమోచనా ॥౧॥దే॥
శ్రీపతీ హరి పావనా-లోకపాలభరణ పీతాంబరా-(హరి.)
తాపసాంచితమానసాబ్జవినోదనా మధుసూదనా ॥౨॥

43. రాగము-తాళము.

అక్షి—జనకా చేరనిమ్మా-ఏమాతనయుని నను జేకొమ్మా ॥పల్లవి॥
అనయము చూడంగ-మానము నగోరికె-
మానిని డిగ్గకొమ్మా ॥౧॥
కన్నతండ్రినిసు-గానక యుంటిని-కన్నుగిదయ
రానిమ్మా-నాపయి ॥౨॥

44. రాగము-కేదార. తాళము రూపకము.

అక్షి—చేకొమ్మా సీమద్దు సుతుని-పొమ్మనక ॥పల్లవి॥
నెమ్మనమ్ము-నెమ్మిగ్రమ్మ-సమ్మదమ్ము గ్రమ్మరించె ॥అను॥
అర్జు—నాబాలా నేడ గూరుడును రా-ఈలాగా మో-
శీలతాల-వాలబాళి-దాళజాల-జాలమేలనో ॥పల్లవి॥
అభి—రంగమీ అ-కౌంగిలించితి-పొంగెనంతరంగము-
భంగమెల్ల-బ్రమింగెనీదు-మంగళాలింగనంబు ॥ ॥౧॥
అర్జు—విన్ననైతి-నన్ను జేయు-మన్ననంబునన్నరో-
నిన్న జాడ-కున్న నేర-మెన్నకింక జెన్నుమీఅ ॥ ॥౨॥

నాయుడు భయము.

45. రాగము-పీలు. రూపకతాళము.

ఉత్తరుడు—భూతనాథ మోహనా-శ్వేతవాహనా-భళి ॥ ॥పల్లవి॥

ఎన్నిభంగుల నిన్ను నియ్యెడ-సన్నుతింతును

యున్నతముగ నీకు నేమని-విన్నవింతును ॥ ॥౧॥

అరసినను మన్నించి నాదగు-భరము బాపవే ।

యరమరలేకింక నాపయి-గరుణజూపవే ।

46. రాగము-సురటి. తాళము-రూపకం.

అభి—సారసాక్షి తాళసేదు-క్రూరమారుడు ॥పల్లవి॥

లోకవినుత కోకిల-పికసంఘకిలకిల,

నాకనికనాంగమిన్న-లోకసుందరీ ॥ ॥౧॥

భూవరేణ్యనందనీ । లావణ్యరూపిణీ ।

భావనాథ రాజ్యశాంబు చేసి యుద్యనే ॥ ॥౨॥

47. రాగము-నవరసకన్నడ. రూపకతాళము.

ఉత్తరుడు—అరయగ గాండీవధనుర్ధర-ఘనుసు మానందమహిమ ॥

అయ్యా గను త్తర పుణ్యాభూమ-యువతీనసమసూనమయు ॥పల్లవి॥

చాలగ నా భాగ్యమునకు-సంతసించితి-ఎంతో-సంతసించితి

కాలునికో అలుపట్టి-కూలదన్ను వాడవనిపుడే ॥అ॥ ॥౧॥

48. రాగము-రాగమాలిక. ఝంపతాళము.

ఉత్త—విలకింపుము భూవర-మేలగు ప్రీతి ॥పల్లవి॥

అరయగ నీ సత్య-పరుడు యుధిష్ఠిరు-డవు దారకుమారుడును.

తెరలబలుకకుపరాకుననిటు ధరాధిపగమని వాక్యములిక ॥

॥నాటకురంజి॥

అనుబంధము.

పొలుపుగ నామహా_బలసూనుడీతఁడు_విలసిల్లు భీముఁడు
వెలియ జేయుము_విలోకనము ను-త్రిలోకయులను
2 ఒలోజ్వలుడితముడా ॥ ॥శంకరాభరణ॥

కనుగొనుపీరలశ్విని దేవసూనులు-ఘనులగుయామళులు
తనరజేయుకు_మనాదరణము_జనాధిపునిను-వినాయెరుగరు
॥శహాన॥

తుదకామాలినియని_యొదవినపేరున-వొదవెను సైరంధ్రి-
యదియె ద్రౌపది-సదాశుచితకు-యుదాహరణము-
గదానరవర ॥అ॥ ॥మోహన॥

భీమ——అరుదారనీతడె_సురపతీసూనుడు_నరుడు-ఫల్గుణుండు
పరమపాపాజిత-సరోజహితుడు-విరోధివిసర-ధరోన్నతపలుకా
॥కేదార॥

ఉత్తరుడు——అభినవకాంతితో-నలరారునీతడె-యభిమన్యు[illegible]
విభవమేమన-ప్రభాపరిమిత-విభావసుడగు-శుభావహుడిత-డా[illegible]
॥సావేరి॥

49. రాగము-బ్యాగు. ఏకతాళము.

సర-సీరుహదళనయనా-వర-సారసభవగిరిజా-
వర-నారదబుధజనతా-సుర-వారనిగమనుతా-
ధీరా-సారా-మితధీలోకాధారా ।
భంగో-జ్వలకం-ధిశయా-కమలా ।
రామా-భీమా-యిన-నేత్రాసర్వేశా ॥

మంగళము.